కాశీ హిందూ విశ్వవిద్యాలయం సంస్కృత మహావిద్యాలయం ఫొటో : శ్రీ ఆర్. భద్రిరాజు, వెల్లి



కాశీ హిందూ విశ్వవిద్యాలయం సైన్సుకాలేజ్ ఫొటో : శ్రీ హెచ్. యన్. వేదాంతం.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 47
5-8-53

విజయ ఆషాఢ బహుళ ఏకాదశి; బుధవారం







"తెగినతీగల వీణ—తగలబొగిలెడి వీణ
సుస్వనమ్మొక కైన—నిస్వనింపని వీణ"

[illegible]

# విషయానుక్రమణిక



# సంధి - విగ్రహం

సంధి విగ్రహం (పంచతంత్రం) బొమ్మల సీరియల్ కారణాంతరాల వల్ల ప్రచురించలేక పోయినందుకు చింతిస్తున్నాము. తిరిగి త్వరలోనే ప్రచురించగలమని పాఠకులకు మనవి.

—సంపాదకుడు.




"క్రిమిసముదాయ సంకులము,
కేవల నింద్యము, పూతిగంధ హే
యమును, నిరామిషంబును,
ఖరాంగభవంబగు నెమ్ము గుక్క దా
నములుచు, చెంతనున్న సుర
నాథుని గన్గొని సిగ్గుజెందదు;-ద
ల్పమని నిజస్వభావము
దలంపదు నీచపు ప్రాణి యెయ్యెడన్"

తా॥ పురుగులు కలిగినదియున్నూ, కేవలము నిందింపదగినదియున్నూ, కంపు కొట్టుటచేత రోత పుట్టించునదియున్నూ, మాంసము లేనిదియున్నూ, గాడిద శరీరములోని భాగము అయిన ఒక ఎముకను కుక్క నములుచున్నటువంటిదై, తన ప్రక్కను దేవేంద్రుడు వచ్చి నిలువబడియున్నప్పటికీ, ఆ దేవేంద్రుని చూచి ఆ కుక్క సిగ్గుజెందదు. నీచప్రాణి తన నిజస్వభావము నీచమైనదని ఎప్పటికిన్నీ గ్రహించదు.

తన స్వభావము ఎటువంటిదో తాను తెలిసికొనలేకపోవడమే గ్రామసింహం విషయంలో చెప్పబడిన దోషం. అంతే కాదు. కుక్క విషయంలో మరొక్క నేరం ఆరోపింపబడింది. ఆ కుక్క నములుచున్నటువంటి ఎముక గాడిద కళేబరం తాలూకు కండలేని ఎండు ఎముక. అది పురుగులు పట్టిన మురికి ఎముక. ఆ కంపు దాని కెట్లా యింపయినదో ఊహింపజాలం. నిజమే. ఇదంతా దాని దోషం కాదు. అదంతా ఊహింపలేక పోవడం మన దోషం.

తన్ను తాను తెలిసికొన్నవాడు దైవమంతవాడు. అయితే దేహధారులైనవారందరూ దేవాంశ సంభూతులే. ప్రతి ప్రాణిలోనూ, ప్రతి క్రిమిలోను, ప్రాణం ఉంది - చైతన్యం ఉంది. "చిత్" అంటే జీవశక్తి. ఆ "చిత్" స్వరూపమే భగవంతునియొక్క అంశ. సత్తు, చిత్తు, ఆనందం, అనే మూడున్నూ భగవంతుని లక్షణములన్నారు. తాను "నిత్యం" అని భావించి ప్రతివాడూ తన జీవితవ్యాపారములను, తన నిత్యకృత్య వ్యవహారములను నిర్వహిస్తూ ఉంటాడు. "తాను" అనేటటువంటిది "నిత్యం" అని ఊహిస్తాడు. కాని, మాట్లాడుతూ మాట్లాడుతూ, ఆవులించి, కళ్లుమూసికొని, హరి! అన్నవాళ్లు ఎందరో ఉన్నారు. డెబ్బది ఏండ్ల వృద్ధు రాజయ్య అటూయిటూ తేలకుండా మంచం మీద యింకా మూలుగుతూ ఉన్నాడు. కాని, తన ఆస్తికి తగిన ఔరసులు లేరనిన్నీ, తాను కష్టించి గడించిన డెబ్బదివేల ఆస్తికి వీలునామా వ్రాసి బందోబస్తు చేయకపోతే అది ఎందుకూ పనికిరాకుండా పోతుందనిన్నీ, ఆ వేదన పడుతూ మరింత మూలుగుతున్నాడు. వెంటనే సబు రిజిస్ట్రారును తన యింటికి పిలిపించాడు. సబు రిజిస్ట్రారుగారైన ముఖ్యప్రాణరావుగారు ముప్పది యేండ్ల నడివయస్సువాడు. ఆ ఊళ్లో రాజయ్యగారికి ముఖ్యప్రాణరావుగారు ముఖ్యస్నేహితుడు. పిలవగానే సబురిజిస్ట్రారు యింటికి వచ్చాడు. "రాజయ్యగారూ! మీరు వీలునామా వ్రాయించి ఉంచడం మేలైనపని - అంతా సాంతంగా చదివాను. మీకు యిద్దరు సాక్షులుయిక్కడే హాజరుగా ఉన్నారు. హాయిగా వారిద్దరూ సంతకాలు చేస్తారు. ఆ యిద్దరిలో ఒకరు మీ డాక్టరుగారే - ఈ వీలునామా మీరు పరిపూర్ణమైన స్మృతియున్నూ మన స్థిమితమున్నూ స్వతంత్రతయున్నూ కలిగి ఉండగా వ్రాయబడినదే అని డాక్టరుగారు వ్రాసి సంతకం చేస్తారు. ఇంకేం కావాలి? ఈ వీలునామా నాయెదుట రిజిష్టరయినట్లుగా నేను సంతకం చేసి దాని కివ్వాలే ప్రాణప్రతిష్ఠ చేస్తాను. దానికి నేను ప్రాణంపోసిన తర్వాత, మీ ప్రాణం హాయిగా ఉంటుంది. మీరు పండిన పండు - భగవంతుని ఆజ్ఞ కోసం అనుక్షణం ఎదురు చూస్తున్నారు. ఈ విల్ రిజిష్టరయిన తర్వాత మీరు ఇహానికి స్వస్తిచెప్పి పరం సంగతి చూచుకోండి. మీ కేమిటండీ? అన్ని విధాలా అదృ

దాసు వామనరావు

ష్టవంతులు" అని రాజయ్యగారి మంచం ప్రక్కను ఈ ప్రసంగరాజమును ముఖ్యప్రాణరావుగారు ముగించి, వీలునామామీద తేదీయున్నూ సైమున్నూ వ్రాసి, తన సంతకం చేయడానికి సిరాబుడ్డిలో కలం ముంచబోతూ, కుర్చీకి జేరగిలబడి, గుండె మీద ఏదో నొప్పిగా ఉన్నదని అవులించి, అంతటితో చాలించాడు ఇహలోకయాత్ర అకస్మాత్తుగా.

ముఖ్యప్రాణరావుగారు ముప్పయియేళ్ళవాడు — గుమ్మడిపండు వంటివాడు—కాని గుండె ఆగిపోయింది; ఆయువు తీరింది అకస్మాత్తుగా అన్నారు. డెబ్బది ఏండ్ల రాజయ్య జబ్బుతో మూల్గుతూనే ఉన్నాడు. ఆయన వీలునామా రిజిస్టరు చేయవచ్చిన ముఖ్యప్రాణరావు ఏ వీలునామా లేకుండానే వేరే లోకానికి వెళ్ళిపోయినాడన్నారు. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, రాజయ్యకంటె తాను నిత్యమని ముఖ్యప్రాణరావు భావించి, బడాయిగా ప్రసంగం చేసి, ఆయనకు పరలోకప్రాప్తి సమీపిస్తోంది అని చెప్పినవాడు తనకు సమీపిస్తున్న పరలోకప్రాప్తిని గ్రహించలేకపోయినాడు. తన భవిష్యత్తు తాను తెలిసికొన్నవాడైనట్లయితే, అవిధంగా ఆ ముసలి రాజయ్య ముందర తన పసుచు నీతులు, పారాయణం చేస్తాడా? మృత్యువు ఆసన్నమై, మృత్యుముఖంలో తలకాయ దూర్చిన ముఖ్యప్రాణరావు తన నిజాయుఃప్రమాణ స్వభావమును తాను గ్రహించినవాడైనట్లయితే, తన వీలునామా రిజిస్టరు చేసికొనకుండా, మూలుగుతున్న ముసలి. రాజయ్య వీలునామా రిజిస్టరు చేయడానికి ఎందుకు వస్తాడు? రాజయ్య యిదంతా చూచి తన మిత్రుడు తన యింట్లో, తన ముందర, తన విల్ కాగితం రిజిస్టరుచేస్తూ, చిత్రగుప్తుని రిజిస్టరులో అతడే ఎక్కడం చాలా చిత్రంగా ఉన్నదన్నాడు. ఈ విచిత్రం చూచి మానవుల అజ్ఞానం యిటువంటిదే గదా! అని తన మనస్సులో తాను అనుకొన్నాడు. ఎవనిసంగతి వానికి తెలియదు.

మరొకక్షణానికి మనకు రాబోయేది మనకే తెలియదు. తన పూర్వవృత్తాంతం మాత్రం తనకు తెలుసునా? పూర్వజన్మలో తాను ఎవరో ఎరుకపడినదా? తన భార్య ఎవరో అవగాహన అయిందా? మన పూర్వ జన్మ కర్మ ఫలితం యిప్పుడు మనము అనుభవిస్తున్నామని మన తత్వవేత్తలు వ్రాశారు. ఒక కుశాగ్రబుద్ధి ఒక ముసలాగ్రప్రశ్న స్థూలంగా వేశాడు. పూర్వ జన్మలో మనంచేసిన పాపం ఏదో మనకు తెలియడం లేదుగదా! ఏ పూర్వ పాపానికి, ఏ పూర్వ జన్మ అపచారానికి యీ జన్మలో యీ అవస్థలు అనుభవిస్తున్నామో మనకు తెలియడంలేదు. కనుక, మనంచేసిన నేరమేదో మనకు తెలియబరచకుండా మనలను శిక్ష అనుభవించేటట్లు చేయడం న్యాయంకాదు. ధర్మ స్వరూపుడైన భగవంతుడు అటువంటి పనులు చేసేవాడు కాడు. కనుక, మనకు తెలియని పూర్వ జన్మ కర్మఫలితం యీ జన్మలో అనుభవిస్తున్నామని వాదించడం అవకతవక అవ్యక్త ప్రలాపం. మనపూర్వజన్మాపరాధములను మనకు తెలియనివ్వకుండా భగవంతుడు మనలను యీ అవస్థలు అనుభవించవలెనని విధిస్తాడా? భగవంతుడు మన నేరం మనకు తెలియబరచకుండా శిక్షించేటటువంటి గుడ్డి దర్బారు కుటిల శాసనుడా? అని ఒక కుశాగ్రబుద్ధి అడిగే ముసలాగ్రప్రశ్న ఇది. కాని యిది చాలామంది అడిగే సిసలైన ప్రశ్న.

అయితే, అడిగేవానికి చెప్పేవాడు లోకువ అనే భావంతో అడగడం కూడదు. మనం చేసిన కర్మయొక్క ఫలితమే మనము అనుభవిస్తాము. కాని భగవంతుడు అనేవాడు ఎవడో వచ్చి తీర్పుచెప్పి, సర్కారు తాఖీదు జారీచేసి, తన దర్బారును జగత్తు అంతటా సాగించడం లేదు. ఈరోజున మనం ఏ హోటలులో ఏ కప్పులో ఏ కాఫీ తాగినామో, ఆ కప్పులో ఏ క్రిములున్నాయో మనకు తెలియదు. కాఫీ హోటలులో ఫలాహారం చేసి యింటికివచ్చిన తర్వాత పైత్యవికారం కలిగి వాంతులు భేదులు అయి నానా అవస్థలతో తలతిరిగి తలప్రాణం తోకకు వచ్చింది. ఇదంతా ఎందుచేత కలిగింది? ఆ కప్పులో ఏ క్రిములు ఉన్నాయో గాని, అవి గర్భంలో ప్రవేశించి ఇటువంటి దుర్భరావస్థ కలిగించాయి. ఈ సంగతి మనకు తెలుసునా? ఈ జన్మలోనే ఈరోజున యీ క్షణంలో మనం చేసినటువంటి ఏ పనికి, ఏ కర్మకు ఫలితంగా యీ ప్రసవవేదన అంతా పడ్డామో మనకే తెలియదు. తెలిసికొనలేకుండానే ప్రవర్తిస్తున్నాము. ఈ క్షణంలో మన కడుపులో జీర్ణకోశం ఏవిధంగా మారుతున్నదో మనం చూచుకోలేకుండా ఉన్నాము. మన డబ్బు అంతా భద్రంగా గుండె నిబ్బరంతో ఏ బ్యాంకులో దాచుకొన్నామో, ఆ బ్యాంకుయొక్క స్థితి ఊగిసలాడుతున్నదనే నిజపరిస్థితిని ఎంతో మెలకువతో ఎంచి చూచి పొంచిచూస్తూ ఉంటాము. కాని, మనగుండె ఏరోజున దివాలాతీసి ఆగిపోతుందో మనం గమనించలేము, గ్రహించలేము. రాత్రి అంతా హాయిగా నిద్రపోయి, తెల్లవారేసరికి పక్షవాతంవచ్చి రెక్కలు విరిగిన పక్షివలె పడిపోయినవారున్నారు. తన రిస్టుగడియారం ఎన్ని నిమిషాలు ముందుగా పోతున్నదో ఎన్ని నిమిషాలు వెనుకంజ వేస్తున్నదో ఎప్పటికప్పుడు సరిచూస్తూ, సవరిస్తూ ఉంటాడు. కాని తన శరీరంలోని నాడులు ఏ విధంగా నడుస్తూన్నాయో ఎందుచేత నాడికి వేడి తగ్గుతున్నదో, ఎప్పటికప్పుడు చెప్పలేడు. వాతం కమ్మేవరకు వాచ్ తిరుగుతూ ఉన్నదంటాడు — ఈపరుసను, వర్తమాన కర్మఫలితంకూడా, పూర్తిగా మనం గ్రహించలేకుండా ప్రవర్తిస్తున్నాము.

అయినా, ఒక్క విషయం బాగా ఆలోచించాలి. మనం త్రాగేనీళ్ళలో అనేక సూక్ష్మక్రిములు ఉన్నాయి. భూతద్దంతో పరిశోధించి చూస్తే అవన్నీ భూతాలులాగున కన్పిస్తాయి — నిజంగా ప్రతి కాఫీ కప్పును యీవిధంగా కంచుకాగడా వేసి పరిశోధిస్తే మనం ఆ క్రిములను చూచిన తర్వాత ఆ కాఫీని త్రాగనే లేము. నీరు త్రాగడానికి నోరు తెరువలేము. మనం త్రాగేదిఅంతా "క్రిమిసముదాయసంకులం"— మనం తినేది అంతా "క్రిమిసముదాయసంకులం". కళ్ళు మూసికొని తినడంవల్లనే, కడుపునిండా తిని కంటినిండా నిద్రపోతున్నాం నిశ్చింతగా.

మన వర్తమాన పరివర్తన పరిజ్ఞానమే ఇంత ఘోరంగా అఘోరిస్తూ ఉండగా, ఇక పూర్వజన్మ పరిజ్ఞానంకూడా మనకుఉంటే, మతి చెడి గతి చెడి దుర్గతిపాలై, "ఏదీ గతీ నాకు" అని ఏడుస్తాం. మన పూర్వజన్మలో మనము ఏ కుష్ఠరోగిగా ఉండి బాధ లనుభవించామో దివ్యదృష్టివల్ల మనం దర్శించగల్గితే, ఆదృశ్యం భరించగలమా? ఈరోజున తన సహధర్మచారిణిగా ఉన్న యిల్లాలు పూర్వజన్మలో ఏ వెలయాలుగా ఉండి ఎట్లా ప్రవర్తించినదో దివ్యదృష్టివల్ల దర్శించగల్గితే, అది ఈ దాంపత్యాంత్య దర్శనముపుతుంది. ఇక ఉభయుల పొత్తుకూ స్వస్తి అంతటితో.

దివ్యరూపసందర్శనం అంటే మాటలతో అయ్యే పని కాదు. "కలయో వైష్ణవ మాయయో" అని దిగ్భ్రాంతి పొందవలసి వస్తుంది. ఏ మహాయోగిపుంగవుడైనా మన ముందుకు వచ్చి, మనకు కలిగిన ముసలాగ్రసందేహమునకు కసరుకొనక కడుసంతసించి కరుణించి, తన యోగశక్తివల్ల మనకొక తన్మయావస్థను కల్పించి, మన భూత భవిష్యద్వర్తమాన పరివర్తనా ప్రపంచం అంతా ఒక ఫిల్ము లాగున టెక్కట్టు లేకుండా చూపించినప్పటికీ ఆ విశ్వరూప సందర్శనం మనం భరించ

# ★ కాలక్షేపం ★

లేదు. అంతేకాదు. అంతా మాని ఇదంతా రోగమాయ అంటాము. యశోద కూడా యిదంతా వైష్ణవమాయ అని శంకించింది. తల వంకించింది. నమ్మటానికి జంకింది.

అందాకా ఎందుకు? "ఇందుగలడందు లే"డనే, భగవంతుణ్ని దూషించగలవా? అని ప్రహ్లాదుణ్ని హిరణ్యకశిపుడు సవాలు చేశాడు. కాని, చివరకు నరసింహావతారంగా ప్రత్యక్షమయ్యేసరికి ఆ రూపమును చూచిన "హిరణ్యకశిపుడు" అనే వాడే హరించిపోయినాడు. ఈ అవతార తేజోరూపమును ప్రహ్లాదుడు చూచి భరించి నమస్కరించాడు. కాని, నరసంహారం కాకుండుటకై ఆ నరసింహావతారం చాలించవలె నని ప్రహ్లాదుడు ప్రార్థించాడు.

భగవంతుని నిజస్వరూపం ప్రత్యక్షనిదర్శనంగా సాక్షాత్కరించినప్పటికీ, మనం చూచి భరించగల తాహతు మనకు ఉన్నదా? మన ఆత్మతేజస్సు ఎటువంటిదో దాని ప్రభావం మనకు అనుభవం అనుదిన సాధకంవల్ల ముందుగా కావాలన్నారు. ఆత్మశక్తి ఎటువంటిదో అనుభవైకవేద్యం అయినట్లయితే, "తాను" అనబడేటటువంటిది యీ "ఆత్మశక్తి" యని బోధపడుతుంది. "తాను" అనబడే ఆత్మశక్తి నిజమైనదే అనిన్నీ, అది ఊహాకల్పితం గాని అభూతకల్పనగాని కాదనిన్నీ, అది అసత్యం కాదనిన్నీ, అది సత్యమైనదనిన్నీ, అది శాశ్వతమైన దనిన్నీ గ్రహింపగల్గిన వాడే మహాత్ముడు. "తాను" అని చెప్పుకోనేటటువంటి "ఆత్మ" నశించేదికాదని మహాత్ములు అనుభవరీత్యా గ్రహించారు. "తాను" మరణం పొందడం అసంభవం అన్నాడు. "దేహం" అనేది "తాను" కాదన్నాడు. అందువల్ల ఈ దేహము దహించుకునిపోయినా మాకు భయం లేదన్నారు ఆత్మజ్ఞానులైన మహాత్ములు. అందువల్ల తుపాకి గుండ్లవల్ల అపాయం లేదన్నారు. నాథూరాం రివాల్వరు పేలిస్తే "రాం! రాం!" అన్నాడు మహాత్ముడు. తన శరీరానికి "రాం! రాం!" అనివిడిచిపెట్టాడు. ఎవరికి విడిచిపెట్టాడు? నాథూరాంకు తన శరీరం సమర్పించాడు. అతడు కోరింది అదే – కాని, (*Gandhi dies. Gandhism lives.*) (గాంధీ నిర్జీవి – కాని, గాంధీతత్వము చిరంజీవి) ఆ విషయం పూర్తిగా గ్రహించినది, పూర్తిగా విశ్వసించినది గాంధి మహాత్ముడే – ఆయన తన నిజతత్వం గ్రహించాడు. ఆ నిజతత్వం నిశ్చలతత్వం అని వాదించాడు. "గాంధి" అంటే "గాంధీ" తత్వమే "అన్నాడు. "గాంధీని" గౌరవించడం అంటే, గాంధీ పాదపూజచేయడం కాదన్నాడు. గాంధీ ఆకారపటం ఆరాధించడం కాదన్నాడు. గాంధీతత్వాన్ని అనుసరించాలి అన్నాడు. రాట్నం త్రిప్పి, సత్యం, అహింస అనుష్ఠించాలని అహోరాత్రాలు బోధించాడు. ఆత్మశక్తి ప్రభావం గ్రహించినవాడే భగవంతుణ్ని చూడగలుగుతాడు. కాని, ఆత్మజ్ఞానం లేక మాయలోపడియున్న వాళ్లకు "భగవంతుడు" అని చెప్పబడేవాడు కూడా ఒక మాయగానే, ఒక మోసంగానే కన్పిస్తూ ఉంటాడు.

"భగవంతుణ్ని దూషించు" అని సవాలు చేసేవాళ్లు చాలామంది ఉన్నారు. కాని, భగవంతుడు ఏదో ఒక రూపంలో అటువంటివారి యింటికి, వారు ఒంటరిగా ఉన్నప్పుడు వచ్చినట్లయితే, "నీవు చూడవలెనని కోరిన భగవంతుణ్ని నేనే" అని చెప్పి యింట్లోకి ప్రవేశించినట్లయితే, లోపలికి రానిస్తారా? తలుపు వేసి వెలుపలికి గెంటివేస్తారు. "ఇటువంటి మోసగాండ్లను యీ పట్టణములో చాలామందిని చూచాం. పో! అవతలికి. పోకపోతే, పోలీసులకు ఒప్పగిస్తాను జాగ్రత!" అని తరిమివేస్తాం. అయితే, ఆ భగవత్సాక్షాత్కార సందర్శనాభిలాషులైన విలాస వితర్క పురుషులు అనేది ఏమిటంటే, "ఆ రూపంలో వచ్చిన ఆ భగవంతుణ్ని గుర్తుపట్టి గురి ఏర్పరచుకోగల శక్తి ఒక్కటి ముందుగా మాకు కలిగితే, అవిశ్రాంతంగా తరిమివేయకుండా తప్పకుండా తరిస్తాము" అంటారు. "శ్రావణ భాద్రపదాలు మేమే" అని వచ్చినప్పుడు నిజం అని నమ్మి, నెలల తరబడి భోజనం పెట్టింది ఒక యిల్లాలు. కనుక అటువంటి మోసం మత విశ్వాసంవల్ల కలుగకూడ దంటారు. నిజమే – భగవంతుణ్ని గురించి నమ్మగల ఆత్మవిశ్వాసం ముందుగా కలగాలి. అదే ఆత్మజ్ఞానం. తనలో ఉన్న ఆత్మశక్తి ఏదో గ్రహించాలి. అదే తన నిజస్వరూపం అని గ్రహించాలి. అప్పుడు మోసం అంటే భయపడడు. మరణం అంటే భయపడడు' తన సొమ్ము అపహరిస్తారనే భయం ఉండదు. తన ప్రాణం పోతుందనే భయం ఉండదు. తన స్వస్వరూపం చూచి ఆనందిస్తాడు. ఆ భగవంతుని దైవతేజం ఎటువంటిదో మృత్యుభీతి గాని, దేహాభిమానం గాని లేనివాడే గ్రహిస్తాడు.

ఈ మధ్య చిత్రవాడలో ఒక ఫోటోగ్రాఫరు వెలిశాడు. చిత్రవాడలో ఉన్న పెద్ద పెద్ద ఆసాములందరూ ఒకరి తర్వాత ఇంకొకరు వస్త్రాదుల బాగు మస్తాబు అయి చాలా ఠీవిగా ఫోటో లతీయించుకొన్నారు. ఫోటోలో చూస్తే ఒక్కొక్కరు దేవేంద్రుని తల దన్నినట్లుగా ఉన్నారు. ఒకరిని మించి యింకొకరు ఫోటోలలో పోటీ చేసినట్లున్నారు. "ఇంద్రుడో చంద్రుడో మరి యుపేంద్రుడో" అన్నట్లున్నారు. కాని, యీ ఆసాములనే పొలంలో పని చేస్తున్నప్పుడు చూస్తే వారిని యీ ఫోటోలతో పోల్చి గుర్తించడానికి గోరంతయినా అవకాశం

(52 వ పేజీ చూడండి)

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

# కథలు, గేయాలు, చిత్రాల రచనలో

రాబోయే 'విజయదశమి' పండుగకు (1953 అక్టోబరు 17 వ తేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుందని పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము. బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాసక్తిని ప్రోత్సహించడానికి గాను పోటీ పెడు తున్నాము. ఈ పోటీలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతు లివ్వబడతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్ళలోపు బాల బాలికలు మాత్రమే ఈపోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.

* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైనకాని పెన్సిల్, సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్ తో మాత్రమే వ్రాసిపంపాలి.

* రచనలు, బొమ్మలు 1953 సెప్టెంబరు 15 వ తేదీలోగా మాకు చేరేవిధంగా పంపాలి.
* రచయితలు చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతో పాటు వ్రాసి పంపాలి.

* స్వీకరించబడని రచనల్ని బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపులుకూడా చేర్చి పంపాలి.

* కవరుపైనా లేక రేపరుపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

**ముఖచిత్రం:** ముఖచిత్రానికి అవసరమైన రంగులబొమ్మలు కూడా స్వీకరించబడతాయి. వీనిని కూడా పదిహేనేళ్లలోపు బాల బాలికలే పైనియమాలకు లోబడి పంపాలి. కవరుపేజీకి స్వీకరించబడే చిత్రానికి ప్రత్యేక పారితోషికం ఇవ్వబడుతుంది. ఈచిత్రాన్ని మాత్రం ఆగష్టు 15 వ తేదీలోగా పంపాలి




పాత్రలు :

రాజారావు ...లంక జమీన్‌దారు
వెంకన్న ...సేవకుడు.
రామానుజం ...డిటెక్టివు నవలా రచయిత, రాజా అతిథి
నరహరి, నారాయణ, మోహన్, సుకుమార్ ...ఇతర మిత్రులు
కమల ...నరహరి భార్య
నళిని ...ఎస్టేటు మేనేజరు కూతురు.

## ఒకటో అంకం

[ఒకానొక నదీ ముఖద్వారంలో ఒక లంక. రాజారావు ఎస్టేటులో ఇదొక భాగం. ఇక్కడే మిగిలిందల్లా పూర్వులు కట్టించిన ఒక పురాతన భవనం. భవన ప్రాకారానికి లోపలే ఒక చిన్న యింట్లో ఎస్టేటు మేనేజరు, ఆయన భార్య, పుత్రిక నళినీ, ఒక సేవకుడు ఉంటారు. రాజారావు ఎప్పుడైనా ఏడాది కొకసారి వచ్చి కొద్ది రోజులుండి వెళ్ళిపోతూ వుంటాడు.

ఒకసారి మిత్రులతో కలిసి సరదాగా కొన్ని రోజులు గడపడానికి లంకకువస్తాడు. వచ్చిన మరునాటి రాత్రి 8 గంటలకి తుపాను వచ్చే సూచనలు కనపడతాయి. గుడ్డివెన్నెల వచ్చినట్లే వచ్చి ఇట్టే మూసుకుపోతూ వుంటుంది. అపిసా దపిసా ఉరుములు, మెరుపులు, హోరుగాలీ, దూరాన సముద్రఘోషా భీతావహంగా ఉంటాయి.

భవనంలో ముందుహాలు. హాలులో కుడి ప్రక్క గోడకు కుడిచివర కిటికీ, దానికి ఎడమవైపున వరండాలోకి పోయే వాకిలి వుంటాయి.

వెనకగోడకు ఎడమ చివర పడమటింటికి పోయే గుమ్మం. కుడి చివరనుంచి వున్న మెట్లు ఐదడుగుల ఎత్తుగల బాల్కనీ మీదకు తీసుకుపోతయ్. బాల్కనీ చివర రాజారావు పడకగదిలోకి ద్వారం వుంటుంది.

ఎడమవైపుగోడకు 40 సం|| వయసుగల భద్రపురుషుని ప్రతిమ చిత్రం ఒకటి తగిలించి వుంటుంది. దానికి సరిగా కింద భోజనాల గదిలోకి ద్వారం వుంటుంది. హాలులో ఒక మేజా, మూడు కుర్చీలు, రెండు సోఫాలు వుంటాయి.

తెర లేచేసరికి గది చీకటిగా ఉంటుంది. ఒక్క క్షణం చీకటి. తరవాత పెద్దమెరుపు. అంతా ఒక్కసారి ప్రకాశించి మళ్ళీ చీకటవుతుంది.

మోహన్ ఒక కుర్చీలోనూ, రామానుజం టేబిలుమీద, నళిని నరహరి చెరోవైపు సోఫాల్లోనూ కూర్చుని వుంటారు—మరో కుర్చీలో కూర్చున్న సుకుమార్ చెప్పేది వింటూ.]

రామా : ఆఁ - ఏం జరిగింది తర్వాత?

సుకు : ఏముందీ - మళ్ళీ ఆ రాత్రికూడా యిద్దరూ ఆ సందులోనే కలుసుకున్నారు. ఎవళ్ళకంటా పడమనుకున్నారు... కాని అనుకోకుండా ఆవిడ మొగుడికంటబడ్డారు. పడే పడటంతోటే ఇద్దరూ చెరో గుండుకి ఆహుతి అయిపోయారు. అంతే!

[బాల్కనీమీద ద్వారం తెరుచుకుని వచ్చి రాజారావు మెట్లపైననిల బడతాడు. పడక గదిలోంచివచ్చిన వెలుగులో ఛాయామాత్రంగా కనపడతాడు.

మోహన్ : అయితే - ఆమెని ఆ ప్రియుణ్ణీకూడా హత్యచేసింది ఆ భర్తే నంటావ్?

నళిని : సరె - రామాయణమంతా విని.

[రాజారావు బాల్కనీమీద స్విచ్ ఆన్ చేసి గదితలుపులు మూస్తాడు. మెట్ల మీది లైటు వెలుగుతుంది.]

నళిని : ఓ! రాజా!

రాజా : ఇంకా క్రైమ్ క్లబ్ మీటింగ్ లోనే వుంటే! లైటన్నా వేసుకోకుండా! (మెట్లు దిగివస్తూ) ఎందుకు తీసుకొచ్చి కుదువ కూర్చోబెడితే - హత్యలూ హంతకులూ తప్ప మరేం లేకపోయే మాట్లాడుకోటానికి?

నళిని : అదేమిటి - అంత సరదాగా అంత అద్భుతంగావుండేది మరోటేముంది?

సుకు : హత్యాకాండ కథ్యారామాసే అవకాశమిస్తే వారెత్తు ధనం పోసినా వదులుకుంటామా?

రామా : కాలా అనుకూలంగా వుంది నా తావరణంకూడా యిప్పుడు! నిర్మానుష్యమైనలంక - నిశీథ సమయం - కన్నుపొడుచుకున్నా కానరాని చీకటి - మెరుపులూ ఉరుములూ - రాబోతూన్న తుఫాను - ఓహో - ఇంకేం కావాలి హంతకుడిన్నవాడికి?

రాజా : పనసకాయ దొరికినప్పుడే తద్దినమున్నట్టు ఇప్పుడిక్కడకూడా ఓహత్య జరిగితే బాగుంటుందంటారా?

సుకు : దివ్యంగా వుంటుంది.

రాజా : ఓరి - మీ దాహం గూల.

రామా : సరేగాని సుకుమార్! - చెప్తున్నారే మీరు సందులో హత్యని గురించి! సమంజసంగానే వుందిగాని అందులో మీ వ్యూహం చాలా వరకూ -

మాత్రం వుంటుంది. వరండా తలుపు తెరుచుకుని కమల వస్తుంది.]

కమల: (వస్తూనే చాలా ఆదుర్దాగా) భోజనాలుకూడా అయిపోయాయో ఏమో బావా. సరాసరి అక్కడికి పోవడమే మంచిది.

నారాయణ: (వెనకాలే వచ్చి) ఏమిటంత తొందర? నామటుకు నాకేం ఆకలిగా లేదు.

కమల: మనం ఎక్కడవున్నా మనుకుంటున్నారో, ఏంచేస్తున్నా మనుకుంటున్నారో వాళ్లు!

నారా: ఏమన్నా అనుకోనీ. మనకేం?

[నారాయణ వరండా తలుపు వేసేస్తాడు. కమల భోజనాల గదికేసి వెళ్లబోగా, నారాయణ చెయ్యిపట్టుకు ఆపుతాడు.]

కమలా!

[కిటికీలోంచి ప్రసరించిన మెరుపులో ఇద్దరూ మెరుస్తారు. ఒక్కక్షణం నిశ్శబ్దం.]

కమల: ఏంపని బావా? వొద్దు నా మాట విను.

[చెయ్యి విడిపించుకుని అటు పోతుంది.]

నారా: (ఆమె ననుసరిస్తూ) ఇంతలోకే ఏం వచ్చింది? మన మాటలన్నీ అప్పుడే మరిచిపోయావా? (కమలను ఆపుతాడు)

కమల: సరేగాని - సరళ ఎప్పుడొస్తుంది?

నారా: ఏమో ఎవడికి తెలుసు?... వస్తుంది రేపు మధ్యాహ్నమో యెప్పుడో... అయినా అదెప్పుడొస్తేమటుకేం యిప్పుడు? నీ కంటే ఎక్కువా నాకది? (అంటూ ఆమెని సమీపిస్తాడు)

కమల: (దూరంగాపోతూ) అబ్బా!- ఎవరన్నా వస్తే—?

నారా: ఎవడొస్తాడు - అందరూ భోజనాలదగ్గరుంటే!

కమల: ఐతేమటుకు?...మావారికే కనక మన సంగతి తెలిస్తే? అసలేఆయనకి పుట్టెడు అనుమానం.

నారా: నీ పిచ్చి గాని - ఈరోజుల్లో ఎవరూ ఇలాంటివి ఆట్టే పట్టించుకోరు. చూసీ చూడనట్టు వూరుకుంటారు.

కమల: అబ్బో - మీ మొగాళ్ళ సంగతెవరికి తెలీదు? పుస్తె కట్టినంతమాత్రాన ఆడది మీసొత్తనీ చచ్చినట్టు పడివుండాలనీ అనుకుంటారు?

నారా: (నవ్వుతూ) నరహరి అనుకుంటాడేమో అలా అని - నేను కాదు.

కమల: అవునవును. అందుకే కాబోలు ఏదో నోరు జారి పొరబాటు మాటన్నదని పెళ్లాన్ని పుట్టింటికి తోలి, రెండేళ్ళయినా ముఖం చూపించావుగాదు.

నారా: సరళ విషయం వేరు. అయినా రేపిక్కడికి రమ్మని రాశానుగా.

కమల: సరళే ఇల్లా చేస్తే...

నారా: ఉప్పు పాతరేస్తాను. (ఇంతలో టేబుల్ దగ్గర, సవ్వడి, చీకటిలో నరహరి గబగబాలేచి భోజనాల గదిలోకి వెళ్తాడు.)

కమల: (ఉలిక్కిపడుతుంది. మెల్లిగా) ఎవరది?

నారా: ఏమిటది?

కమల: ఎవరో - (మాటపెగలదు.)

[ఇద్దరు గదిమట్టూ చూస్తారు]

నారా: ఎవరూ లేరే!

కమల: నా చెవులారా విన్నాను. ఎవరో పరుగెత్తుకుపోయిన సవ్వడి.

నారా: వుత్తి భయం.

కమల: కాదు బావా, ఎవరో ఇక్కడ దాక్కున్నమాట నిజం!

[నారాయణ తలుపుతీసి వరండాలోకి వెళ్తాడు. (ఉరుములూ మెరుపులూ]

కమల: వద్దు బావా నువ్వ వెనక్కి వచ్చెయ్—

నారా: (వచ్చి) నా కెవళ్లూ కనిపించలేదే!

కమల: విన్నాను. ఏదో తలుపు కూడా మూసుకున్న చప్పుడయింది!

నారా: మరేం ఫరవాలేదు. నువ్వనవసరంగా భయపడకు. హోరెత్తిపోతున్న గాలి చప్పుడై వుంటుంది.

[భోజనాలగది తలుపు తెరుచుకుని నరహరివస్తాడు. అక్కడేవున్న స్విచ్ వేసి లైటు వెలిగిస్తాడు. అతి కష్టంమీద అణచుకొన్న ఉద్రేకం అతని ముఖంలో తేలగా కనిపిస్తుంది. నారాయణ, కమల అతనివైపు తిరుగుతారు. వీళ్ళతో అతను చాలా సౌమ్యంగా ప్రవర్తిస్తాడు.]

నారా: (గుక్కతిప్పుకుని) హల్లో నరహరీ! మాకోసమే చూస్తున్నారా యేమిటి?

కమల: (భర్తదగ్గరకు వస్తూ) అబ్బ హాపలగొట్టేరండీ - గభాల్న వచ్చేశారు.

నర: భోజనాలు మొదలెట్టి చాలా సేపయింది. మీరు మర్చిపోయారేమో ననుకున్నాను.

కమల: లేదు - ఎప్పుడూ ఇలాంటి లంకలకు రాలేదు గదూ. అందుకని ఆదృశ్యాలన్నీ చూస్తూ కూర్చున్నాం.

నారా: లేదు లేదు. నేను మాత్రం నీ మొహమే చూస్తూ కూర్చున్నా.

కమల: (బిక్కమొహంతో క్షణం సేపు మాట్లాడలేదు. తరువాత) పోబావా -నీ వేళాకోళాలూ నువ్వూనూ! (భర్తతో) ఏమండీ- చాలా ఆలస్యమైపోయిందా యేమిటి?... కోపగించకండి.

నర: (తెచ్చిపెట్టుకున్న చిఱునవ్వుతో) కోపమెందుకూ?

[కమల భోజనాల గది లోకివెళ్తుంది.]

నారా: (చాలా హుషారుగావున్నట్టు) అవును. నా మఱదలుపిల్ల ముఖారవిందం చూస్తూంటే ఎవరికి మటుకు ఎలాకోపం రాగలదు?

[వాకిలికేసి రెండడుగులు వేస్తాడుగాని నరహరి తలుపు మూసేస్తాడు.) నారాయణ ఆగిపోతాడు.]

నారా: కదూ నరహరీ! చాలాచక్కని మొహం!...అవునూ-ఆసౌందర్య పాశంలో చిక్కుకుని ఆమె ప్రేమకోసం పరితపించే వాళ్ళని ఏంజేస్తావ్?

నర: ఏంజేస్తే బాగుంటుం దంటావ్? నువ్వే చెప్పు.

నారా: వాళ్ళనలా వదిలేసెయ్. ఆ సౌందర్య వహ్నిలో హుతమై చావనీ.

నర: (భారమూ క్రూరమూ అయిన స్వరంతో) చావడమా?...ఓ...అవును... అదే బాగుంటుంది.

నారా: (అతని స్వరంవిని నిశ్చేష్టుడై) అదేమిటి? ఏదో పరిహాసానికి అంటే...ఆః ...వెళ్దామా యిక, చాలా సేపయిందన్నావ్ పద్దించి? (అని నరహరి పక్కగా వెళ్లి తలుపు తెరుస్తాడు.)

నర: ఒక్కమాట...నీతో కాస్త మాట్లాడాలి.

[నారాయణ అతనివంక తెల్లబోయిచూసి తెరిచిన తలుపు మళ్ళీ మూసేస్తాడు. నరహరి మాట్లాడకుండా తన వంకే తదేకంగా చూస్తున్నకొద్దీ అతని హృదయం మరింత చలించిపోతుంది.]

నారా: ఏం?...ఏమిటి?... ఎందుకూ అలా చూస్తున్నావ్?

నర: అబ్బే - ఏంలేదు. చూడటంకాదు. వూరికే ఏదో ఆలోచన తట్టింది...ఆః -

నారాయణా! మీ ఆవిడకూడా వస్తుంది కదూ యిక్కడికి?

నారా: (అర్థం కాలేదు ఎందుకడుగుతున్నాడో.)

నర: అహఁ - మీ యిద్దరూ రాజీపడిన తర్వాత ఇదేగా ప్రథమ సమావేశం.

నారా: అవునూ.

నర: మరి నువ్వు లాంచీ తీసుకువెడుతున్నావా; ఆమెని తీసుకురావడానికి?

నారా: ఏమో - ఐనా అదంతా ఎందుకిప్పుడు?

నర: అబ్బే - యేముందీ...అహ - నీ భార్యకి పాపం నువ్వక్కడా కనిపించక, ఇక్కడా కనిపించకపోతే——

నారా: ఏం? కనిపించక ఏమౌతానూ?

నర: ఏముందీ——ఏం లేదు...ఏమీ లేదు.

నారా: ఊఁహుఁ——

[నరహరి అతని ముఖంలోకి చాలాసేపు సాలోచనగా చూస్తాడు. నారాయణ వెంటనే వెనక్కి తిరిగి గబగబా లోపలికి వెళ్లిపోతాడు. నరహరి ముఖం క్రూరంగా ఒక అడుగు ముందుకువేసి ఆగి సిగరెట్ ఆష్ట్రేలో క్రూరంగా చిదిపేసి పడమటింట్లోకి వెళ్ళిపోతాడు.

రాజారావు భోజనాల గదిలోనుంచి వచ్చి మెల్లెక్కుతూ వుంటాడు. వెంకన్న బయటనుంచి వస్తాడు - చేతిలో టపా వుంటుంది.]

వెంక: (రాజాని చూసి) ఇదిగో బాబూ - టపా తీసుకొచ్చాను.

రాజా: (దిగివస్తూ) ఏమిటోయ్ ఇన్ని వుత్తరాలు తెచ్చావ్!

[టపా తీసుకుని టేబిలుమీదకు విసిరేస్తాడు.]

వెంక: గాలి జోరుగావుంది బాబూ. వర్షంకూడా వచ్చే ఆనవాళ్లున్నాయి. మీ శెలవైతే ఇంటి కెళ్తానని లాంచీ డ్రైవరు అడగమన్నాడు బాబూ!

రాజా: హోరి - మనల్నందర్నీ ఈ లంక కప్పగించి తినుమట్టుకు ఒడ్డుకు జేరుకుంటాడా!... సరే - పొమ్మను. ఉండి మటుకేం జేస్తాడిక్కడ!

వెంక: మళ్ళీ యెప్పుడు రమ్మని చెప్పమంటారు? ఆ రెవరో ఈడికి తీసుకు రావాలి గామోసు రేపు మద్దాన్నపేళ?

రాజా: (ఉలిక్కిపడి లేచి) అవునవునోయ్ - సరళ! జ్ఞాపకం చేశావ్ - మంచి పనే! ఆవిడగారి మొగుడు కూడా వెళ్తాడేమో ఈలాంచీలోనే అమ్మగారికి స్వాగతమియ్యడానికి! (అటు తిరిగి) నారాయణా! (అని కేకవేసి మళ్ళీ వెంకన్నతో) చూడు - లోపలికి వెళ్ళి నారాయణ్నొకసారి పిలు.

వెంక: (వెళ్లబోతూ ఆగి జేబులోంచి టెలిగ్రాం తీసియిస్తూ) టెలిగ్రాం బాబూ.

రాజా: (తీసుకుంటూ) ఇదెక్కణ్ణుంచోయ్.

[వెంకన్న లోపలికి వెళ్తాడు. రాజా టెలిగ్రాం చదువుతాడు. వెంకన్న నారాయణను వెంటబెట్టుకు వస్తాడు.]

నారా: ఏమిట్రా రాజా?

రాజా: (చదువుతూ) సరళ దగ్గర్నుంచి వైరు...తను రేపు రావటం లేదట.

నారా: అంత చులకనైపోయా నేమిటి నిన్నటి నే రానేసరికి?

రాజా: వాళ్లమ్మకేదో సుస్తీగావుందట - ఎల్లుండి బయల్దేరుతున్నా నంటోంది.

నారా: అంతేనా - ఇంకేమన్నా వుందా?

రాజా: అంతే!...అవును.

నారా: ఓసారి చూడొచ్చా నేను?

రాజా: అఁ?...ఓ... చూడొచ్చు. (ఇస్తాడు)

వెంక: ఐతే ఆరు రేపు రారన్నమాట. అంతేగదు బాబూ?

రాజా: అఁ. ఎల్లుండి మధ్యాహ్నం... లాంచీ డ్రైవర్ని అందాకా అక్కడే వుండమని చెప్పు. ఒకంగా వాళ్లని తీసుకుని రావచ్చు.

[మారాని ఉఱుములు - గాలి]

వెంక: సరే బాబూ చెప్తాను. గాలి కూడా బాగా లేస్తోంది - ఏ తుఫాన ముంచుకొస్తుందో మరి.

రాజా: అచ్చా.

[వెంకన్న వెళ్తాడు. ఆ వాకిలి తలుపులు మూసుకున్న చప్పుడు - టెలిగ్రాం

# ★ కాళరాత్రి ★

చూస్తున్న నారాయణ ఉలిక్కిపడతాడు.]

నారా: అదేమిటి?

రాజా: ఏది?...అరె – వెంకన్న వెళ్తూ వెళ్తూ తలుపేసి పోయాడు. అంతే!

నారా: ఓరి దేవుడా! గుండె లవిసి పోయాయి.

రాజా: (కిటికీ తీసిపోతూ) నిజమే!... ఈ లంక నిజంగా గుండె దడపుట్టిస్తుంది. రామానుజంగారికి నచ్చిందంటే ఆశ్చర్యం లేదు. ఇక్కడ పట్ట పగలు పట్టు గొంతు కోసినా—

నారా: రాజా—

రాజా: అవున్రా! ఇక్కడ ఏం జరిగినా జరగొచ్చు. మానాన్నగారు కూడా ఈమాటే అంటూండేవారు. ఆయనకి ఈ లంకంటే చాలా విచిత్రమైన ఆలోచనలుండేవి. నేనుమటుకు ఎప్పుడేం ఘోర సంఘటన జరిగిపోతుందోనని ప్రాణాలు బిగబట్టు కూర్చునేవాణ్ణి. అలాంటి దింత వరకూ ఏం జరగలేదనుకో. కాని ఇప్పటి కూడా ఇక్కడో నాలుగు రోజులుంటే చాలు ప్రాణాలు కడగడతయ్.

[దూరాన లాంచీవిజిలు]

అదుగో – లాంచీకూడా వెళ్లిపోతోంది. మళ్లీ వాడొచ్చేదాకా మనకిక్కడ బంది ఖానాయే! ఏంజరిగినా దిక్కూ మొక్కూ వుండదు.

నారా: ఇంకో లాంచీవుందిగా?

రాజా: అదోక దొప్ప. త్రేతాయుగం నాటిది. ఈనాలుగు మైళ్ళూ తిరించడానికి దాన్ని నమ్ముకుంటే ఇక ఒడ్డెక్కినట్టే.

[కమల వస్తుంది]

కమల: (రాజాతో) కొత్త మీరైనా మందలించండీ మీ అతిథుల్ని.

రాజా: ఏం – ఏమంటున్నారు?

కమల: ఎంతసేపూ హత్యలూ హంతకులూ! అది వాణ్ణెందుకు చంపింది. వాడు దాన్నెందుకు చంపాడు – ఇదే గోల! వింటూంటే హడలుపుడుతోందికూడానూ.

రాజా: మనం ముగ్గురమే ననుకుంటూను హత్యల్నీ అలా హంతకులకి మాత్రం వది లేసి వూరుకున్నది!

కమల: బావా! రాజారావుగారితో కొత్త వంటరిగా మాట్లాడాలి. నువ్వు అవతలికి వెళ్లావ్?

నారా: తప్పకుండానూ. (వెళ్తూ ఆగి) కాని – కను సన్నల్లో మెలిగేవాళ్లం... మొహాన కుండబద్దలు కొట్టడ మెందుకు చెప్పూ...అన్నట్టు జాగ్రత్తరోయ్ రాజా! ఇందాక నరహరి నావంక చాలా తీక్ష్ణంగా చూశాడు.

కమల: పో బావా. (నారాయణ భోజనాలగదిలోకి వెళ్తాడు. కమల చాలా ఆందోళనతో చేతిలో రుమాలు నలిపేస్తూంటుంది. అది రాజారావు గమనిస్తాడు.]

కమల: నాకు చాలా భయమేస్తోంది రాజారావుగారూ, తలుపులన్నీ వేసేవున్నై గదా?

రాజా: (అర్థంకాలేదు) వేసేవున్నై. ఏమిటసలు సంగతి?

కమల: ఈ లంకలోకల్లా మనమేనా మనుష్యులం?

రాజా: మా నళినిని చూచారుగా –అదీ, వాళ్ల అమ్మా, నాన్నా–ఆయనేలే ఇక్కడ మా మేనేజరుగారు – ప్రస్తుతం ఆయన వూళ్ళో లేడనుకో. పోతే మన పార్టీ, పని మనుషులూ ఒకరిద్దరు జాలర్లూ తప్ప మరెవరూ లేరు...(కొంటెగా, భయపెడదామని) వీళ్లని మినహాయిస్తే మన చుట్టూతా అంతులేని గాలీ – అగాధపు నీళ్ళూ – అదటుపుట్టించే హత్యా రహస్యాలూను!

కమల. ఓహ్ – ఇక్కడ హత్యలుకూడా జరుగుతూంటాయా యేమిటి?

రాజా: నాకు తెలిసినంతవరకూ జరగలేదనుకోండి. జరిగినా జరగొచ్చు ననిపించడం లేదూ మీకు?

కమల: అబ్బ – ఏమండీ—

రాజా: ఓ – క్షమించండి. వాళ్లందరి పిచ్చే నాకూ పట్టినట్టుంది కొస్త...అఁ – అసలు సంగతేమిటి? ఏం జరిగింది?

కమల: మీరంతా భోజనాలదగ్గరున్నారు చూడండీ – అప్పుడు, నేనూ మా బావా ఇక్కడికొచ్చి మాట్లాడుతూ నుంచున్నాం. అంతలోనే ఎవరో ఈ గదిలోనే నడిచినట్టు పరుగెత్తి పోయినట్టూ వినిపించింది. ఇటు తిరిగి మాసేసరికి ఎవరూ లేరు. వాకిట్లోకి కూడా వెళ్లి చూశాడు బావ... నిజంగా నాకు చాలా భయమేస్తోందండీ...

రాజా: అంటే? మీమీద ఎవరైనా నిఘాపెట్టి మాస్తున్నారంటారా?

కమల: (త్వరత్వరగా) అబ్బే అంత అవసరం ఏముందీ అయినా? అఁహఁ – నేననేదేమిటంటే వాడెవడైనా దొంగవెధవేమో నని!...

రాజా: (సాలోచనగా) సామాన్యంగా ఇక్కడికి దొంగలెవరూ రారు. అందులోనూ ఇలాంటి రాత్రి—

కమల: పోనీలెండి – నేనే ఏదో భ్రమపడి వుంటాను. సరే – నే లోపలికి వెళ్తాను.

రాజా: వాళ్లకి కొన్ని వుత్తరాలొచ్చాయి. తీసుకెళ్లి ఇస్తారూ? (ఇస్తూ).

కమల: ఓ – (తీసుకుని వెళ్తూ ఆగి) మీరు రారూ!

రాజా: ఇప్పుడే ఒక్క క్షణంలో వస్తాను.

[అని పడమటింటిలోకి వెళ్తాడు. కమల ఆగి చేతిలోని వుత్తరాలు మాస్తుంది. ఒక కవరుతీసుకుని మిగతావన్నీ బల్లమీద పెడుతుంది. కవరు చింపి కాగితంతీసి చదువుతుంది. చదువుతూన్న కొద్దీముఖంలో ఈసడింపు, చికాకు కనిపిస్తాయి. చదివి కాగితం ముక్కలు చేసి చిత్తుకాగితాల బుట్టలో పారేస్తుంది. బల్లమీదవున్న వుత్తరాలన్నీ చేతబట్టుకుని వెళ్తుంది. చించిన వుత్తరం తాలూకు ఖాళీ కవరు కూడా ఆ వుత్తరాల్లో చేరుంది.

అప్పుడే వరండాలోంచి లోపలకు వచ్చిన నళిని వెళ్లి పోతున్న కమలను చూస్తుంది. నళిని వచ్చి టేబిలుమీద పుస్తకాలు తిరిగేస్తూండగా రాజారావు వస్తాడు.]

రాజా: ఏం నళినీ – మళ్లా వచ్చావ్?

నళిని: ఇందాక ఒక పుస్తకాని కింకోకటి తీసికెళ్లానూ...

రాజా: ఏది? – (తీసుకుమాచి) "రక్త దాహం' గ్రంథకర్త రామానుజం!"

హరి భగవంతుడా! ఈకొంపలో రామానుజమూ వాడి చెత్తరాతలూ తప్ప ఇంకేం లేవా?

నళిని: నువ్వెప్పుడన్నా చదివావా అవి? చదువుతున్నంతసేపూ ప్రాణం కొట్టుకుపోతుంటే!

రాజా: ప్రాణం కొట్టుకుపోతుంటే ఏమిటంత సరదా? మీలాటి వాళ్లంతా నిజమైన హంతకుడే ఎదటపడితే ఏంచేస్తారో?

నళి: రాజా – ఆగుమా...

['రక్త దాహం' టేబిలుమీద పడేసి మరో పుస్తకం తీసుకుంటుంది.]

రాజా: ఎలాగూ మళ్ళీ వచ్చావ్ గదా– డిన్నరౌతోంది. నువ్వుకూడా కానిచ్చే పోరాదూ?

నళి: మరి నువ్విక్కడే వున్నావేం?

రాజా: నా కాకలిగా లేక కొస్త సంజె వచ్చేశాలే. నువ్వొస్తానంటే మళ్ళీ కూర్చుంటాను నీతో బాటు.

నళి: కాదులే – ముందీ పుస్తకం చదివెయ్యాలి.

[వరండా గుమ్మంలోంచి వెళ్లిపోతుంది నళిని. రాజా ఆమె వెళ్లినవైపే ఓ క్షణం చూసి వరండా తలుపు మూసేసి మెట్లెక్కతూంటాడు. ఇంతలో భోజనాల గదిలోంచి నారాయణ వస్తాడు. రాజా బొల్క

నీమీద ఆగుతాడు. నారాయణ అతన్ని చూడడు.

ఉరుములూ - మెరుపులూ—

టేబిలుమీదవున్న వుత్తరాలన్నీ గబగబా చూసి నారాయణ ఒకటి తీస్తాడు. వణుకుతూన్న చేత్తో కవరు తెరవబోతాడు—]

రాజా : (మెట్లుదిగి వస్తూ) ఏం నారాయణా - ఏమిటి వెతుకుతున్నావ్ ?

నారా : (ఉలిక్కిపడి కవరు దాచడానికి ప్రయత్నిస్తూ) ఆఁ - అబ్బే - నాకేమన్నా ఉత్తరా లొచ్చాయేమోనని చూస్తూన్నా.

రాజా : ఇక్కడున్నవన్నీ నావే ననుకుంటాను. మిగతావన్నీ కమలకిచ్చి లోపలికి పంపానే. (దగ్గరకొచ్చి అతని చేతిలో కవరుచూసి) ఓ-ఏదో దొరికినట్టుందే మొత్తానికి!

నారా : (లేని నవ్వు తెచ్చుకుని) లేదు...(తిరిగి ఇచ్చేస్తూ) ఇది నీదే!

రాజా : మరి?

నారా : అది...మా ఆవిడదగ్గర్నుంచి.. కదూ ?

రాజా : అలానే కనిపిస్తోంది దస్తూరీ.

నారా : ఆఁ - నాక్కూడా ఓ చీటీ రాసి అందులో వుంచిందేమోనని.

రాజా : వుంటేనే చెప్పేనూ.

నారా: ఓ-ఐతే సరే. థాంక్స్...(కొస్త కుష్కహాసం చేసి) సరే వస్తానూ - (వెళ్లబోతాడు)

రాజా : ఆగు—

[కవరు చింపి వుత్తరం తీసి చదువుతాడు, ఖాళీ కవరు చిత్తుకాగితాల బుట్టలో పారేసి.]

ఏమీ లేదు. రాలేనని టెలిగ్రాం ఇచ్చిందే - ఆ సంగతే ఉత్తరంద్వారా ఖాయం చేసింది. వాళ్ళమ్మ వెళ్లమని బలవంతం చేసినా తనే బాగుండదని రేపటికి ఆగి ఎల్లుండి తప్పకుండా వస్తానని రాసింది...చూడు...

[ఇస్తాడు. నారాయణ చదువుతూండగా రాజారావు డ్రాయరులోంచి రివాల్వరు తీసి చూస్తూంటాడు. తోటాలుకూడా తీసి పెడుతూంటాడు.]

నారా : ఇంతేకదా. సరే వస్తాను.

రాజా : కొంచెం ఆగు. నీతో మాట్లాడాలి.

[రివాల్వరు నారాయణవైపు తిరిగి వుంటుంది. ఒక ట్రేలో పాలగ్లాసు పెట్టుకు వచ్చిన వెంకన్న ఇది చూసి తృళ్ళిపడతాడు. రాజా అతన్ని చూసి దాచబోతాడు గాని లాభం లేదని మానేస్తాడు.]

సరే—నువ్వు వెళ్ళు నారాయణా— తర్వాత మాట్లాడుదాం.

[నారాయణ వెళ్ళిపోతాడు.]

వెంక : (తెప్పరిల్లి) భోజనం కూడా సరిగా చెయ్యలేదుగా బాబూ - ఇవైనా పుచ్చుకోండి - పాలు తెచ్చాను.

రాజా : (రివాల్వరు జేబులో పెడుతూ) మంచిపని చేశావ్ వెంకన్నా....వెంకన్నా! ఖర్మంజాలక ఇవ్వాళ రాత్రి నా అతిథుల్లో ఎవరికైనా ఏదైనా ప్రమాదం సంభవిస్తే నువ్విప్పుడు చూసిన విషయం చెప్తావు కదూ!

[రాజా పాలు తీసుకుంటాడు.]

వెంక : నేనేం చూశాను బాబూ? నాకేం కనిపించలేదే... నే నే మెరుగుదును?

రాజా : (నవ్వుతాడు) భలేవాడివి వెంకన్నా - మంచివాడివి. (పాలు తాగుతూంటాడు)

వెంక : ఘరనా లేదంటే చెప్పండి బాబూ ఎప్పుడు జరుగుతుం దది?

రాజా : ఏది?

వెంక : అదే - ప్రమాదం!

రాజా : ఓ - అదా!...అదసలు జరక్కపోవచ్చు...కాని ఒకటిమాత్రం ఖాయం -

[ఉరుముల చప్పుడు]

నా అతిథిల్లో ఎవరన్నా మాయం కావడమే కనక సంభవిస్తే దానికితగ్గ కారణం మటుకు వుంటుందని గుర్తించుకో.

వెంక : వుంటుంది బాబూ—తప్పకుండా వుంటుంది.

రాజా : అంతే.

[గ్లాసు ట్రేలో వుంచుతాడు. ట్రే తీసుకునిపోతూ, ద్వారందగ్గర, లోపలకొస్తున్న రామానుజానికి దారియిచ్చి లోనికి వెళ్ళిపోతాడు వెంకన్న.]

రామా : ఓ-రాజారావుగారు! వున్నారే మీ రిక్కడే! చూశానిందాక నా పుస్తకం ఒకటి టేబిలుమీద! అది కావాల్సి—

రాజా : ఐతే - నాకు తెలీక అడుగుతానూ - మీ పుస్తకాలు మీరే చదువుకుంటూ కూర్చుంటారా ?

రామా : లేదండీ...బోధపరుస్తున్నా వాళ్ళకి 'నరపిశాచి' విషయం - తార్కాణం చూపిద్దామని వచ్చా నా పుస్తకంకోసం. (టేబిలుమీద చూచి) లేదే పుస్తకం ఇక్కడ..

రాజా : నిజంగా బలేపని పెట్టుకున్నారండీ జీవితంలో మీరు.

రామా : అవునండీ! అగాధమైన విషయం ఇది ఏముందండీ! అంతా ట్రైనింగ్‌లో వుంది! మానవచర్యల కారణాల్ని గురించి పేద్ద స్టడీ! చేశాన్నేను ముఖ్యంగా హంతకుల—

రాజా : కొస్త విస్కీ యేమన్నా తెప్పించమంటారా ?

రామా : (నిర్ఘాంతపోయి) నో థాంక్స్. లేదండీ నా కలవాటు.

రాజా : ఏమిటీ! అంటే-మీరీ పుస్తకాలన్నీ ఒళ్లెరిగిన స్థితిలోనే వ్రాస్తారా ?

రామా : మరి ?... రాజారావుగారూ! అడుగుతా నొక్కవిషయం—

రాజా : తప్పకుండానూ.

రామా : ఆట్టే పరిచయంకూడా మనిద్దరికీ లేదుగదా - ఎందుకు పిలిచినట్టు మీరీ విందుకి నన్ను ?

రాజా : చెప్తానుగాని - (దగ్గరకు వస్తూ) కొస్త రహస్యంగా వుంచుతారా ?

రామా : రహస్యంగానా ?

[ఉరుములు]

రాజా : హత్యగురించి కొన్ని సంగతులు తెలుసుకోవాల్సి వచ్చింది. ఆ రంగంలో పేరెన్నికగన్న మీరైతే బాగుంటుందని—

రామా : ఎందుకు ?

రాజా : ఎప్పుడో ఒకసారి నేనే ఓ హత్యాకాండ ప్రారంభిద్దామని!

రామా : (నిశ్చేష్టుడై) ఆఁ! [లోపలినుంచి మోహన్, అతని వనకాలే నరహరి, సుకుమార్, నారాయణ, కమల వస్తారు.]

మోహన్ : ఇదిగో రామానుజంగారూ. మీరైనా చెప్పండి. ఇతను చెప్పేది చాలా తప్పని.

రామా : ఏది?

మో : అదే - నరపిశాచి సంగతే.

(నారా : వరండాలోకి వెళ్లబోతాడు.)

రాజా : వెళుతున్నావేం నారాయణా?

నారా : అబ్బ! పోదూ వెధవ హత్యలూ వీళ్ళూనూ. (వెళ్ళిపోతాడు. రాజా కూడా అతనివెంటనే వెళతాడు.)

మో : హత్యలు జరక్కుండా వుండాలీ అంటే హంతకులకి మరణభయం కలిగించాలంటాను. హత్యకు తగ్గ శిక్ష ఉరిశిక్షే నంటే, నరహరి అదేం లాభం లేదంటాడు.

నర : స్టేటిస్టిక్స్ చూడరాదూ తెలుస్తుంది.

రామా : ఏమని?

నర : ఏము నేమిటి - ఎన్ని వురిశిక్షలు విధించినా హత్యలదోవన హత్యలు జరుగుతూనే వున్నాయి. హంతకుల్లో రెండు రకాలున్నారు. చాలామంది తాత్కాలిక క్రోధకంతో ముందు వెనక లరయలేని మొరటువాళ్ళు. వీళ్లకి శిక్ష భయం వుండదు. చటం నిరుపయోగం.

మో : ఇదుగో—

నర : పోతే—వివేకవంతులు కూడా కొందరు కొన్ని కొన్ని పరిస్థితుల్లో హత్య

(౬౮ వ పేజీ చూడండి)

# రాగముక్త

శ్రీ వై. వి. రమణమూర్తి

## 1

రవణ తండ్రీ అక్కా మద్రాసుకు పరుగెత్తుకు వచ్చి ఏదో ముంచుకుపోయినట్లు రవణని ఇంటికి తీసుకుపోతున్నారు. ఏడాదినుంచి కర్ణాకర్ణిగా రవణ జీవితాన్ని గురించి విన్నా పుట్టని తొందర నేడే కలిగింది ఎందుచేతనో. పెట్టెలో ఇంకెవ్వరూ లేరు. మొహం చిన్నబుచ్చుకుని ఒక మూలగా కూర్చున్న రవణకి ఎదురుగా వచ్చి కూర్చుని తండ్రి అన్నాడు, తగ్గు స్థాయిలో. "నీకేం పొయ్యేకాలం వచ్చిందే? మద్రాసులో నువ్వేదో చదువు వెలగబెడుతున్నా అనుకున్నాను! ఆ వెధవతో కాపరం కూడానూ! సిగ్గులేదుటే నీకు?"

రవణ మాట్లాడలేదు. అలాగే ఆలోచిస్తో కూర్చుంది నిర్లక్ష్యంగా, వీళ్ళంటే ఖాతరు లేనట్లు. అదే రవణ వ్యక్తిత్వం... ఆమెతో మాట్లాడితే తండ్రి భయపడతాడు అనిపిస్తుంది, ఆమెను చూస్తే.

"నేనూ మీ బావా ఇంతడబ్బూ ఖర్చుపెట్టి నిన్ను మద్రాసు పంపింది ఈ తెలివైన పని చెయ్యడానికేనుటే?" అంది అక్కగారు.

రవణ ఛర్రుమంది "నువ్వేం డబ్బెట్టక్కర్లేదు. నీలెఖ్ఖ నాకేం లేదు. నాయిష్టం.. నువ్వు నన్ను ఆక్షేపించాలిట! నీ పెళ్ళి సంగతి తెలిసినవాళ్ళూ ఉన్నారు, బావని ఎలా పెళ్ళాడిందీ." అనేసి ముఖం తిప్పుకుని ఆలోచనలో పడింది.

"అలాగేం పాపం! నేను నిక్షేపంలా పెళ్ళి చేసుకున్నాను కాని నీలా నెల తప్పలేదుగా ముందే?"

"నువ్వేం చెప్పక్కర్లేదు నాకు" అని చిరాకు పడింది రవణ.

"అదికాదే, అమ్మాయి. నీకేమన్నా మెదడింట్లో ఉందా? నీ గతేమన్నా ఆలోచించుకున్నావు?"

"మరి నన్నెందుకు తీసుకుపోతున్నారు రాజుకి చెప్పకుండా? నాగతి ఏం బాగు చేద్దామని?"

"దీనిరాత ఇంతే నాన్నా. ఇంత చదువూ చదివి ఆడది తన మానం విలువ తెలుసుకోలేకపోతే దాని ఖర్మ."

"ఆ నువ్వు తెల్సుకున్నావుగా నీ విలువ—"

ఆ తర్వాత ఎవరూ ఆమెని పల్కరించలేదు. ఆమెను అదమాయించే ధైర్యం వారెవరికీ ఉన్నట్టులేదు - బెజవాడ స్టేషను వస్తోంది. వెంకటేశ్వర్లు కన్పిస్తాడేమో అని అక్కా నాన్నా విరగబడి చూస్తున్నారు. రైలు ఆగింది. చూసిచూసి రాలేదంటే రాలేదనుకుని ఆశాభంగం చెందారు. రవణ మాత్రం నిరాశగా కూర్చుంది. వాళ్ళ ఆత్రుత చూస్తే వెనక జరిగిన సంగతి ఒకటి జ్ఞాపకం వచ్చింది ఆమెకి. ఒకసారి సెలవులకి తను ఇంటికి బయలుదేరింది. ఆరాత్రే విపరీతంగా వర్షాలువచ్చి పొంగొలువచ్చి రైలుపట్టాలు నీటిలో మునిగిపోయాయి. కొంతదూరం మోకాలు లోతు నీటిలో నడిచి మరో రైలు ఎక్కి బెజవాడ చేరేసరికి మూడో నాడు మధ్యాహ్నం మూడు గంటలయింది. తన పెట్టెలో అంతా తన స్నేహితురాళ్ళే - వెంకటేశ్వర్లుకి టెలిగ్రాం ఇస్తే క్యారేజితో అన్నం స్టేషన్కి తెచ్చాడు - అతనితో ఆమె పరిచయం అంతా జ్ఞప్తికి తెచ్చుకుంటూంది రవణ. తను ఇంటర్ చదివే ఆ రోజులు; అక్కయ్య పెళ్ళి - తన సెలవుల్లో తను అక్కా బావా దగ్గిరికి వైజాగ్ వెళ్ళడం; బావ చుట్టం వెంకటేశ్వర్లు కూడా నాల్గురోజులుండామని అక్కడికి రావడం; కులాసాగా ఇద్దరూ గడిపిన ఆరోజులు ఈ స్మృతులన్నీ రవణను కలవరపెట్టసాగాయి. చీరచెంగుతో కళ్ళు తుడుచుకోడం ఎవరూ గమనించలేదు. గమనించినా కేకలేసినందుకు ఏడుస్తోందనుకుందురేమో. ఇప్పుడు వెంకటేశ్వర్లు స్టేషన్కి ఎలా వస్తాడు - ఎక్కడో వుంటాడు. నిక్షేపంలా ఒకి దుడుకులు లేని బ్రతుకు—ఇద్దరు పిల్లలు.

క్రమంగా రైలు స్టేషన్లు దాటుకుని వాళ్ళవూరు చేరింది. అక్కా నాన్నా ఇక ఆ ప్రస్తావన తేవడంలేదు. వాళ్ళు రవణతో వాదించే బదులు, ఆమెను ఉద్ధరించే యోచన చేస్తున్నారు.

"అదెప్పుడూ అంతే. చిన్నప్పటినుంచీ మొండి గొడ్డు - నాతో పోట్లాటే" అంది అక్క.

"దానికేంగాని, రెండోనెల వచ్చిందంటూంది. దీనిగతి ఏమిటి? తలెత్తుకోగలమా?"

"మీరంతా ఇంత కంగారుపడతారేం? నేను రాజుని తప్ప మరొకర్ని పెళ్లాడను" అనేసింది రవణ.

"నీ చవట ఇష్టం ఎవరడిగేరు? నిన్ను పెళ్ళాడ్డానికి ఎవరు కూచున్నారు సిద్ధంగా" అని అరిచాడు నాన్న.

ఆ తర్వాత ఆయన బుర్రలోకి తటిల్లత వంటి ఆలోచన వచ్చింది. "పోనీ. అమ్మాయి. అతనూ మనశాఖవాడేట. అతనే పెళ్లాడితే బావుణ్ను - ఏదో నంటనే చెయ్యాలి" అన్నాడు పెద్దకూతురితో.

"ఈమాత్రం తెలివిలేకే మరి నన్నిద్దుకొచ్చారు" అంది రవణ.

అక్క స్పష్టంగా చెప్పేసింది, తనా పెళ్లికి వ్యతిరేకం అని. అందుకు రవణకి ఆమె అంటే వొళ్ళు మహా[illegible]వుంది. తను సర్వస్వం అర్పించి [illegible] పురుషుడితో పెళ్ళికి ఈవిడ వ్యతిరేకంట! రాజుకి ఇదివరకే పెళ్ళయి ఉండడంవల్ల, ఆ భార్యజీవితం తమవంటి చదువుకున్న స్త్రీలే చెరపడానికి తలపడరాదట! చట్ట ప్రకారం కూడా అది నేరంట!... "మరి దారి?" అని నాన్న అడిగితే అక్క సమాధానం చెప్పలేదు.

రాజు లేనప్పుడు చూసి వీళ్ళు తనని లాక్కొచ్చారు. లాడితెడు బుర్రా వీళ్లూ. మళ్ళీ అతనివద్దకే పోవాలంటున్నాడు నాన్న. రాజుని తను ఎరుగును. అతనెప్పుడూ తనను కలలోకూడా మోసం చెయ్యడు. ఆవేళ హైకోర్టు బీచ్లో ఇద్దరూ కూర్చుండగా ఎంత ఆవేశంతో అతను ప్రమాణం చేశాడో, అతని మాటల్లో ఎంత ప్రేమా, నిజాయితీ ఉన్నాయో తనకి తెలుసును. తనకి పెళ్ళయిందనీ, కాని పెళ్ళినాడు తప్ప భార్య మొహమేనా తర్వాత చూడలేదనీ; అది ఇష్టంలేని పెళ్లి అనీ, ఆమెపై మనసు పోవడంలేదనీ ఆవేళ చెప్పాడు. మనిషి అంత లావణ్యవతి కాదుట కాని బాగానే వుంటుందన్నాడు. ఆమాటలు విని తను వెక్కివెక్కి ఏడ్చింది.



రాజు సత్యవతిమీద చెయ్యిచేసుకోబోతుండగా రవణ వెళ్లింది. భయపడిన వాడిలా పోయాడు.

అతను తన తలను వొళ్లోకి తీసుకుని ఎంతగా ఓదార్చాడు!

"అదికాదు రవణా—నన్ను గురించిన సంగతులన్నీ నీకు తెలపనిదే నీతో మరి చనువు తీసుకోకూడదని, అలా చేస్తే అది మోసం అవుతుందని..."

సజల నేత్రాలతో తను "ఏమిటి రాజూ" అని అదోలా చూసింది.

అతను ఏదో నిరాశగా చెప్పడం ప్రారంభించాడు.

"అవును రవణా. పడవల్సిన కష్టాలు అన్నీ పడి, ఒకర్ని గురించి ఒకరు తెల్సుకోవలసిందంతా తెల్సుకున్నాక భార్యాభర్తృ సంబంధం ఏర్పరచుకోవడం మంచిది. చూడు, ఇంకా వుంది నన్ను గురించి... మనం కల్సిఉన్నామని తెలిస్తే నన్ను నా భార్య తరఫు వాళ్ళూ నావాళ్ళూ ఎన్ని విధాల వేటాడాలో, సామాజికంగా ఆర్థికంగా ఎన్నివిధాల అణగద్రొక్కాలో అన్ని విధాలా ప్రయత్నిస్తారు. ఆపోరులో నేను ఓడిపోవచ్చు. నీకూ నాకూ పొట్టకి కావల్సిన ధనం కూడా నేను ఆర్జించలేకపోవచ్చు. నాతో మంచిమంచి కార్లలోనూ, చీరలతోనూ తిరిగి, బంగాళాలలో నివసించగలనని ఆశలు గన్న నువ్వు - ఎలక కన్నంలాంటి ఇంట్లో ఉంటూ, ఒంగుపుల చేటకి తట్టుకోలేక కంపించిపోతూ ఉంటే మన జీవితాన్ని గురించి ఏమనుకుంటావు?'

ఆ మాటలకి రవణకుమారి బిగ్గరగా ఏడ్చింది. 'ఇదేనా రాజూ నీ ప్రేమ. నన్నింతేనా తెల్సుకున్నది? ఇంతవరకూ నాకా సంగతి తెలియలేదు అని బాధపడితే, నిన్నెందుకు ప్రేమించానని విచారించి మనసు మార్చుకుంటాననా అర్థం తీశావు?' ఆమెకి దుఃఖం ఆగలేదు.

అప్పటివరకూ చెప్పుకుంటున్న అతని తండ్రీ, తన అక్కా ఇరువురూ మానేస్తా రీసంగతి తెలిస్తే-ఈ సంగతి తన కిప్పుడు తెలిసినందువల్ల తనేం లాభం పొందగలదు? మనసు అన్యాక్రాంతం కాని-ఆ భార్య రేపు వచ్చి తనస్థానం తన కిమ్మని అడిగితే తనెక్కడ వుంటుందని?

'ఏమిటో నువ్వలా అంటావు కాని రాజూ, ప్రస్తుతం నా అందం, గ్లామర్ చూసి ప్రేమించావేమో - నాళ్లేళ్లు పోయాక - నావల్ల అందరికీ దూరమై సామాజికంగా ఎంతో ఉన్నత స్థాయిలో ఉండవలసిన నువ్వు తక్కువగా బతుకుతూ, పిల్లలు పుడితే అసహ్యంగా తగాదైన నన్ను చూసి ఏమనుకుంటావో నేనూ. చెప్పేదా?' అంది దీనంగా.

'సరే అదంతా మరచిపో రవణా. నీ ప్రేమ శాశ్వతమైనది. సరేనా' అన్నాడు. అప్పటినుంచి ఇప్పటివరకూ అలానే ఉన్నారు - ఇంటదగ్గరనుంచి డబ్బు ఆగి పోయింది. తనకి (రవణకి) వచ్చే డబ్బుతోనే ఇద్దరూ గడుపుకుంటున్నారు. రోజులు నిముషాల్లా గడిచాయి. ప్రేమ అంటే అంతేనేమో!

రాజు ప్రాణస్నేహితుడు నారాయణ కూడా ఆర్థిక సహాయం చేస్తున్నాడు. కొత్తలో అతన్ని చూసి తను భయపడేది. అతని గర్వమూ అని జంకపడ్డాగానీ తననీ గురించి ఏవిధమైన వాక్కూ అతనినోటంట రాలేదు. అతని కెన్ని దణ్ణాలన్నా పెడుతుంది తను. కాని అతని కళ్లలోకి సూటిగా చూడలేకపోతుంది తను. ఇంతలోకే ఈ కడుపు. తనేం భయపడ్డం లేదు కాని వీళ్ళంతా తనని గాభరా ఎత్తిస్తున్నారు. నాన్న రాజుకే యిచ్చి పెళ్ళిచెయ్యాలని నిశ్చయించాక; రాజు తనను కాదనడు. అయినప్పుడు భయం ఎందుకు? కాని అక్క-





మాత్రం ఈ పెళ్లికి పూర్తి వ్యతిరేకం

రాత్రి అక్క తనని భయపెట్టింది. 'ఏం పెళ్ళే - పెళ్ళని ఎవరు తారు - పెళ్ళాం ఉండగా ఇంకో పెళ్లాం అసలు 'లా' ప్రకారం భార్యకాదని తెలియదా? ముందు ముందు నీపిల్లల స్టేటస్ ఏమి' అంది 'మీయిష్టం ఆపైన' అని కూడా అంది.

*　　　*　　　*

తను ముందు మద్రాసు వెళ్ళి అన్ని ఏర్పాట్లూ చేసి ఉత్తరం రాస్తాననీ, పెళ్ళి మద్రాసులాంటి ఊళ్లో అయిందని పిస్తేనే గొడవ పడిపోకుండా వుంటామనీ చెప్పి రవణ తండ్రి మద్రాసు వెళ్ళాడు, పది రోజులైనా ఉత్తరంలేదు. రవణ గాభరా పడ్డం ప్రారంభించింది రాజు ఇన్ని రోజులు ఉత్తరం రాయకుండా ఉండ గలిగే డంటే, ఆమెకి చాలా భయం కలిగింది అతని మనస్సులో ఏమేమి ఆలోచనలు రేకెత్తుతున్నాయో! నాన్న వెళ్లి 10 రోజులైనా ఉత్తరం రాయక పోవడం చూసి మరీ హడలుగావుంది ఈ పరిస్థితిలో ఒక ఉత్తరం వచ్చింది. అది అమాంతం పోస్టు బంట్రోతు చేతులోంచి ఊళ్ళా క్కున్నట్టే తీసుకుంది కవరు మీద రాజు దస్తూరీ ఆనవాలు కట్టింది కాని తీరా చింపి చూస్తే అందులో ఒక్క తెల్లికాగితం తప్ప ఏం లేదు. రవణ తలమీద అశనిపాత మైంది ఆపుకోలేనంత దుఃఖంవచ్చింది. తనమీద రాజుకి కోపంవచ్చి ఉంటుంది అలావెళ్లిపోయినందు కతని మనస్సు విరిగి పోయివుంటుంది. ఉత్తరం గుండెల కద్దుకుని తన దురదృష్టానికి గుండె లవిసిపోయేలా ఏడ్చింది రాజుకే కోపంవస్తే తను బతకగలదా!

ఏడ్చి ఏడ్చి నిద్రించిన రవణ బావ పిలుపుకి తుళ్ళిపడి లేచింది 'మీ నాన్న వెంటనే మద్రాసురమ్మని టెలిగ్రాం ఇచ్చారు అక్కా నువ్వూ వెళ్లండి' అన్నాడుబావ

## 2

మర్నాడే బయలుదేరి మద్రాసువెళ్లింది. రాజుకూడా స్టేషన్కి వచ్చాడు. కాని వాళ్ళందరి మధ్య వాతావరణం ఏమిటోలా వుంది అంతా ముభావంగానే వున్నారు రవణ అతన్ని చూసి కళ్ళనీళ్లు తెచ్చుకుని మాట్లాడకుండా ఊరుకుంది అతనేనా 'ఛా ఎందుకేమిటి' అన్నాడే కాని ఊరడించడానికి వీలు చిక్కలేదు. ఆ తర్వాత రాజే చెప్పాడు, ఫలానరోజు మన పెళ్ళి' అని

'మీనాన్న నామీది ప్రేమ కొద్దీ కాదుటే ఈ పెళ్ళికి అంగీకరిస్తే' అన్నాడు నవ్వుతూ.

'ఏందుకో అందుకు మనిద్దరం ఒకటవాలి. అంతేగా కావల్సింది' అంది రవణ.

ఆ తెల్లకాగితం సంగతే మనసులో మెదుల్తూ ఆమె అతనితో మాట్లాడేటప్పుడల్లా అదోలా అయిపోతోంది. అందరూ ఉండడంవల్ల అతనికీ తనతో మాట్లాడ్డానికవకాశం చిక్కడంలేదు రవణకి చాలా కించగానే వుంది ఈపెళ్ళి అతని కిష్టంలేదేమో అని దీనికి తోడు తన అక్క చెప్పిన సంగతీ అబదంకాదు ఏం పెళ్ళి? తనగతిని గురించి ఆలోచించుకుంటే రవణకి మతిపోతోంది ఈ గర్భం నిలవకుండా వుంటే ఎంతబావుణ్ణు! తన భవిష్యత్తు ఎలా ఉండబోతోందో? అసలిదంతా నాన్నా అక్కా చేసినతప్పు తనని మద్రాసు చదువుకి పంపకుండావుంటే ఎంతబావుండేది రాజంటే తనకి ప్రాణమే అయినా ఏమిటో భయంగావుంది ఎవరితోనన్నా చెపితే, మొదట ఎరగవా ఎంత నంగనాచితనం, అంటారు! వెంకటేశ్వర్లుకీ ఉండేది తనను పెళ్ళాడాలని. కాని తనదే అదృష్టం తరం అంతా! అతన్నే పెళ్ళాడితే జీవితం ఇంకా బావుండేదికాబోలు! రేపు తన పెళ్లికి నారాయణ ఒకసాక్షి ఇతనొక కర్మసాక్షిలా వున్నాడు తనపాలిట! తన జీవితం అంతా ఇతనికి తెల్సు! ఇతను రాజుకి ప్రాణస్నేహితుడు.

ఒకనాడు నారాయణవచ్చాడు. రవణ ఒక్కర్తే వుంది ఇంట్లో తన దీనస్థితిని గురించి ఆలోచిస్తూ కన్నీళ్ళు తెచ్చుకుంటూంది అతన్ని చూస్తే ఏదో అడగాలనిపించి "మీతో మాట్లాడాలి" అంది. అతను ఆగాడు. 'రాజు ఉద్దేశాలు మీకు తెలుస్తాయి మాపెళ్లినిగురించి అతని ఉద్దేశం?'

'కోరిన కోర్కె సవ్యంగా అందరి యిష్టంతోటి తీరుతున్నందుకు కొండెక్కినంత సంతోషిస్తున్నాడు' రవణకి మళ్ళీ దుఃఖంవచ్చింది

'అబద్ధం ఈపెళ్ళి అంత సింపుల్ అనుకోడంలేదు రాజు అసలు అంతా కలిసి నన్ను పాడుచేశారు మానాన్న అక్కా చదువంటూ పెట్టి-ఆతర్వాత మీరూ-నన్ను గురించి మీకు తెల్సినదంతా చెప్పేస్తే నాకీ బాధలేకుండా పోనుగా?' అనేసింది ఏడుస్తూ.

'చూడండి ఎందుకూ బాధపడతారు? రాజు మిమ్మల్ని ప్రాణసమానంగా చూస్తాడు. అతనికీ మీకూ నమ్మకంఉన్న ఈ పెళ్లిని గురించి ఇన్ని సంకోచాలుపడి మనసెందుకు పాడు చేసుకుంటారు? ఏమిటీ సెల్ఫ్‌పిటీ? నన్నడిగితే, మీరెంతో సంతోషంగా ఉండాలి రాజెంతో ఉత్సాహంగా ఉన్నాడు. జీవితం అంటే అంత నిరాశతో అడుగుపెట్టవలసిన అవసరం మీకెంతమాత్రం లేదు'

రవణ తనలోనే సిగ్గుపడింది ఆవేశంలో అనేసింది. తన రహస్యాలన్నీ తెలుసున్నవాడు కనక సరిపోయింది. పైవాళ్లు ఏమనుకుంటారు! రవణ లోపలికి వెళ్లి పోయింది.

రాత్రి రాజు అడిగాడు 'ఒక్క ఉత్తరమైనా రాశావుకాదు మీవూరు వెళ్ళి నన్ను మరిచిపోయినట్లుంది' అని 'నీ తెల్ల కాగితం జాబుకి సమాధానమేమిటి?' అంది రవణ.

అతనూ ఆశ్చర్యపోయాడు. పొరపాటున తెల్లకాగితం కవర్లో పెట్టేశాడు! ఉత్తరం ఇంట్లోనే ఉండి ఉంటుంది 'పోనీలే ఇక్కడే చదువుకో' అన్నాడు. ఇద్దరూ నవ్వుకున్నారు

'అబ్బ వచ్చి ఎన్నాళ్లకి నవ్వేవు! దిగులుగావున్నావు - నన్ను పెళ్ళాడ్డం ఇష్టం లేకా?' అన్నాడు నవ్వి

'ఊఁ మరే-లేదు ఇలాంటి ఉత్తరాలు రాసి ప్రేమచూపిస్తోంటేను!' అంది వెటకారంగా.

## 3

"అమ్మయ్య ఇద్దరం ఒకటయ్యాం. మనల్ని ఇక ఎవరూ విడతియ్యలేరు కదూ రాజూ?" అన్నది పెళ్ళినాటిరాత్రి రాజుని ప్రేమావేశంతో బుజాలు పట్టుకు ఊపుతూ రవణ

"ఇంతవరకూ అపనమ్మకమే నన్న మాట" అన్నాడతను నవ్వుతూ

ఆ ప్రశ్నలో తన భావం ఏదో, ఈ నిశ్శబ్దతలో ఆలోచించుకుంటే, రవణకి స్పష్టంగా తోస్తోంది ఆమాట రాజుమీది ప్రేమలో విశ్వాసమున్నదనడంకంటె, తన స్థితికి సెక్యూరిటీ, జీవితానికొక స్థిరత్వం ఏర్పడిందనే సంతృప్తి వెలిబుచ్చిందనాలి. అతని ప్రేమలో ఆమె కెప్పుడూ నమ్మకమే. ఈమధ్య ఊహా సౌధాలకంటె జీవితంలో స్థిరత్వంకోసం తను పాకులాడుతోంది - సమాజం, ప్రపంచం అంతా తనకి వ్యతిరేకం అని తెల్సు అందరికీ వ

ఏకంగా నడిచే తన బ్రతుకులో ఒక అండ కోసం తపించడం సహజమే ఈ బాహ్య శత్రువులేకాక తనకి తన చేతలే ఎక్కువ అపకారం చేస్తాయని అనుభవంవల్ల ఆమెకి తెలుసు - వెంకటేశ్వర్లు విషయంలో అలాగే అయింది!

ఇవేళ వెంకటేశ్వర్లు వద్దనుంచి తనె న్నడూ ఆశించని ఉత్తరం వచ్చింది వెంకటేశ్వర్లు సంగతి తన అంతరాంతరాలలో కూడా జ్ఞాపకం లేదనుకున్నా, అతని విషయంలో కల్గిన అనుభవ ఫలితంగానే పెళ్ళి నాటి రాత్రి - రాజుతో ఎలా సంతృప్తి

# ★ రాగముక్త ★

తెల్లబుచ్చిందో ఆలోచిస్తే ఆశ్చర్యం కల్గిందామెకి. "వెంకటేశ్వర్లుని నేను పెళ్ళాడనందువల్లనే మళ్ళీ ఈ జీవిత ప్రవాహంలో కొంతదూరం కొట్టుకుపోయాక కానీ ఈ అలంబనం దొరకలేదు. మళ్ళీ రెండవసారి పొరపాటు చేశెయ్యలేదు" అనుకుంది. కాని ఇవేళ వెంకటేశ్వర్లు ఉత్తరంచూస్తే అసంతృప్తి ఒక ఎండమావి అనిపించింది. ఇదివరకు కంటె తన బతుకులోనూ, తన కడుపులోని పసిపాప స్థితిలోనూ ఏంమార్పు తెచ్చిందీ పెళ్ళి "—మీరు మిక్కిలి ఇతని ఉత్తరంలో అన్నట్లు, ఇది రాజు సంతృప్తికీ వెంకటేశ్వర్లు ఆత్మతృప్తికీ తప్ప ఉపయోగం లేదేమో !!

ఈ మనోవేదనలో ఆమె కుదురుగా కూర్చోలేక లేచి అటూ ఇటూ తిరగడం మొదలుపెట్టింది. ఆ ఉత్తరం మళ్ళీమళ్ళీ చదివింది. అతను తన కెప్పుడూ ఒక్క ఉత్తరమైనా రాయలేదు. ఈఉత్తరమైనా చిన్నది.

"రవణా,

'నువ్వు రాజుని వివాహమాడతావని నిశ్చయం అయిందని తెల్సి చాలా సంతోషించాను. ఎప్పుడో తెలియలేదుగాని ఈపాటికి జరిగేవుంటుందని తెల్సింది. నేనతన్ని ఎరుగుదును. మీకు నా శుభాకాంక్షలు. అత్యంత సౌఖ్యవంతము, ఆనందమయమూ అయిన దాంపత్య జీవితం, అభ్యుదయం మీకు సమకూడవలెనని నాకోరిక.

మూడేళ్ళ కిందట మనం ఆఖరుసారిగా మాట్లాడుకున్నప్పుడు కూడా నేను నా జీవితంలో కల్గిన మార్పుల్ని వివరించి నీకు చెప్పడానికి ప్రయత్నించలేదు. నువ్వు అవకాశం ఇవ్వలేదు - ఇది నా మనసులో ఒక శల్యంలా ఉంది. ఇప్పుడు నా మనసులోంచి ఒక పెద్ద ఆరాటం తొలగిపోయింది. మీకు శుభం కల్గుగాక.

ఎప్పటేవా క్షేమం రాస్తూండు.

ఇటు
వెంకటేశ్వర్లు.

ఎంత చిన్న ఉత్తరం! అయినా దానితో పాటు ఎన్ని జ్ఞాపకాలను మోసుకువచ్చింది! ముక్కలు ముక్కలుగా చింపింది ఆ వుత్తరాన్ని ...గడచిన జీవితం కళ్ళముందు కట్టి, కళ్ళవెంట నీళ్లు వచ్చేస్తున్నాయి.

తను రాజుతో ఇప్పుడిప్పుడే అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. రాజు అడిగితే తను ఆశ్చర్యం వెలిబుచ్చింది.

"నాకూ వెంకటేశ్వర్లుకీ పెళ్ళిమాటలా? ఎవరూ అనుకోలేదే—నన్ను పెళ్ళాడాలని అతని కుండేదేమో కాని నాకుమటుకు లేదు. ఎవరుచెప్పారీ సంగతి?"

"నారాయణ అని మా కిద్దరికీ స్నేహితుడే. అతన్నెరుగుదువా? నిన్ను చూశానన్నాడు."

"ఛా! వాడెవడో నాకు తెలియదసలు. వాడి మొహం కాదుగదా పేరైనా ఎరగను"

ఈ నారాయణనే మొన్న అతనికి తెల్సిందంతా రాజుకి చెప్పలేదని మొన్న తిట్టిందితను !!

వెంకటేశ్వర్లు తనమీద కసితీర్చుకుందుకి ఈ ఉత్తరం రాశాడు ఇంతకంటె బల్లెంపెట్టి పొడిచినా హాయిగా వుండేది. తను ఇందాకటినుంచీ ఆలోచిస్తున్నట్లు, తన పెళ్ళి ఇతని తృప్తికోసం ఉపయోగించిందంటే - "నేను రాజుని పెళ్ళాడుతున్నానని విని-అమ్మయ్య; నా నైతికబాధ్యత తప్పింది. ఆమె హృదయమే అన్యాసక్తమైనప్పుడు - నేనేదో నేరం చేశానని ఏడవడం ఎందుకు" అనుకున్నాడన్నమాట!

ఇంతకీ వెంకటేశ్వరు ఏంచేశాడు పాపం! తను ఇందాకనే అనుకున్నదిగా, తనదే పొరపాటని. తను ఊఁ అంటే ప్రపంచాన్నీ తల్లిదండ్రుల్నీ ఎదిరించి పెళ్ళాడతానన్నాడు - తన బతుకిలా నడవాల్సి ఉంటే తనెలా ఊఁ అనగలదు? అపైన, తన కప్పటి కింకా ధైర్యంలేదు. అక్క అంటే విపరీతమైన భయం. మద్రాసువచ్చి నవనాగరికంగా తయారై ఎవర్నైనా ఎదిరించగలనని భరవసా వచ్చాకే రాజుని పెళ్ళి చేసుకుందుకు నిశ్చయించుకుంది. అప్పుడు తనెంత క్లిష్టంగా వుండేదో! తన ఇంటర్ పరీక్ష తప్పిపోవడం ఒక కథ - కెమిస్ట్రీ ప్రాక్టికల్ పరీక్ష చేస్తోంటే ఏసిడ్ తన చీరమీద ఒలికిపోయింది. అంచేత పరీక్ష పోయింది! కొద్ది రోజులుముందే అక్క పెళ్లి, అందులో పరిచయం అయిన వెంకటేశ్వర్లు తనకి పుస్తకాలు తెచ్చిపెట్టాడు మళ్ళీ పరీక్షకి, తనవిపోతే. అవి ఈ నారాయణవేట !!

రాజుతో పరిచయం చాలా విచిత్రంగా జరిగింది. కాలేజి నాటక సంఘ కార్యదర్శి పదవికి అమ్మాయిలంతా కలిసి తనచేత రాజుతో పోటీ చేయించారు. ఆడవాళ్లంటే వుండే ఆకర్షణ శక్తివల్ల ఓట్లన్నీ తనకే పడ్డాయి - నెగ్గింది. కాని అతను అభినందించడానికి వచ్చినప్పుడే తనకి ఒళ్లు విడిపోయినట్లయింది. "మీరే దీనికి తగినవారు" అన్నాడు. ఆడవాళ్ళలోనే ఆ బలహీనత ఉంది. ఆనాటికి తనలో వాంఛలు పూర్తిగా మేల్కొన్నాయి. వెంకటేశ్వర్లుతో ప్రథమ పరిచయమైననాడు తనలో ప్రవృత్తులన్నీ నిద్రితమైఉన్నాయి. ఆనాడు తను నిర్వచించలేని, తనకే సరిగా తెలియని ఆనందమూ రాజుతో పరిచయం అయిననాడు విద్యుచ్ఛక్తివంటి "త్రిల్" అనుభవించింది. నిజానికి ఈ విధంగా, ఒక వేశ్యవలె, ప్రియులలో తారతమ్యాలెంచుకోడానికి రవణ చాలా వ్యథపడుతోంది. కాని మనసుకి రాక మానడంలేదు.

అక్క, బావ అప్పటి కింకా చదువుతున్నారు. వాళ్ళదగ్గిర పదిరోజు లుండి వద్దామని విశాఖపట్నం వెళ్లింది రవణ. వెంకటేశ్వర్లూ వచ్చాడు. అతనెంతో భయం భయంగా సిగ్గుపడుతూ ఉండేవాడు. రాజులాగే అందంగా ఉంటాడు. అతనంటే రవణకి ఏదో అభిమానం కల్గింది. అస్తమానూ తనే కలగచేసుకుని సరదాగా కబుర్లు చెప్పేది. ఒకనాడు తనూ అతనూ బీచికి వెళ్ళి చీకటిపడిపోయాక తిరిగి వస్తున్నారు. ఎదురుగా వస్తున్న మిలటరీవాళ్ళద్దర్ని చూసి రవణ చాలా భయపడిపోయింది. వాళ్ళగురించి విన్న కథలన్నీ జ్ఞాపకంవచ్చి కెవ్వున కేకవేసి పక్కనున్న వెంకటేశ్వర్లుని పట్టుకుంది గట్టిగా. అతనూ నిర్ఘాంతపోయి ఆమెను దగ్గరకి తీసుకున్నాడు. ఇంతాచేస్తే ఆ మిలటరీవాళ్ళు వాళ్ళదారిన పోతేపోయారు !! కాని రవణ సిగ్గుపడింది. తమ యిద్దరిమధ్యనూ ఉండే-అస్పష్టమైన ఆ తెరను ఆవిధంగా ఆ సంఘటన తొలగించింది. ఆ తర్వాత చనవుగా వుండేవారు. పెద్దవాళ్ళిద్దరూ కాలేజీకి పోయేవారు. ఇద్దరూ ఒకేసారి అన్నం తినడం ప్రారంభించి, ఒకే కంచంలో తినడంవరకూ వచ్చింది. అది కూడా వరణే ప్రారంభించింది.

ఆ పదిరోజులు చాలా హాయిగా గడిచాయి. అతను వెళ్ళిపోయేనాడు తనూ బెజవాడదాకా వెళ్ళవలసిందే కనక అక్కను నొప్పించి తనూ ప్రయాణమైంది. విడిపోతూ అతని చెయ్యి గట్టిగా నొక్కుతూ 'పెళ్లి చేసుకుంటావుకదూ. ఉత్తరాలు రాస్తుంటావుకదూ' అంది రవణ. 'ఓ తప్పకుండా' అన్నాడతను.

కాని అతనెప్పుడూ ఉత్తరం రాయలేదు, ఇవేళ్టి ఉత్తరం తప్ప. తను కూడా తర్వాత రాయవద్దంది నాన్న చేతుల్లో పడుతుందనిని. అతనికి ఉత్తరం రాయాలంటే తనెన్ని తంటాలు పడేది, ఏ స్నేహితురాలి ఇంట్లోనో కూర్చుని రాసి పోస్టుచేసేది. ఈ సంగతి క్రమంగా అక్కకీ నాన్నకీ ఎలాగో

తెల్సినదనే తన అనుమానం. లేకపోతే వాళ్ళుతనని అంత అంతు పెట్టరు. అతర్వాత మూడు నెలలకి రవణ ఊరు వచ్చాడు వెంకటేశ్వర్లు. బంధుకోటివారు కనకస్వేచ్ఛగా తిరిగేరు. సినీమాలకి వెళ్ళారు. తమ పెళ్ళిని గురించి తీయనితలపుల్లో మునిగిపోయారు - కాని ఈ సమావేశంలో ఒకటి తేటపడింది. తనవాళ్లు పెళ్ళినిగురించి తొందర చేస్తున్నారనీ, రవణ ఒప్పకుంటే వేగం పెళ్ళి చేసేసుకుందామనీ వెంకటేశ్వర్లు అంటాడు. తన కిష్టంలేదది. తనకి యం. బి. బి. యస్. చదవాలని ఉండేది. అదయిపోయాక చేసుకుందామనీ, ఈలోగానే బయట పడితే అక్క ఒప్పకోదనీ చెప్పింది. అతను చాలా వాదించాడు. కాని ఆమె ఒప్పకోలేదు. 'నీకసలు నన్ను పెళ్ళి చేసుకోవాలని లేదు. ఏదో కొత్తలో వైజాగ్‌లో అలా మోజు పడ్డావు' అని కూడా అన్నాడు—కాని తను లొంగలేదు.

మరి నాల్గు నెలల్లో అతని పెళ్లి ఎవరితోనో నిశ్చయం అయిపోయింది. అయ్యాక అతను తనని మూడుసార్లు కల్సుకున్నాడు. ఒకసారి తన కాలేజికి వచ్చాడు లంచ్ అవర్‌లో. కాని తను 'ఆకలేస్తోందోయ్' అంటూ తప్పించుకు వెళ్ళింది. ఇంకోసారి అక్క ఇంటివద్దా అలాగే చేసింది. మూడో సారి అతనూ నారాయణా బావగారింటికి పనుండి వచ్చారు. మర్నాడు పని వుండి తనూ నాన్నా కూడా బెజవాడదాకా వాళ్లు వెళిన రైల్లోనే ఎక్కారు. వెంకటేశ్వర్లు రవణతో ఒంటరిగా మాట్లాడాలని చేసిన ప్రయత్నాలు, రవణని తండ్రి ఒక్కక్షణం వదలకపోవడంవల ఫలించలేదు. అప్పుడే నారాయణ నాన్నని సోదిలోకిదించి ప్లాటుఫారం చివరికి లాక్కుపోయాడు. అప్పుడే వెంకటేశ్వర్లు చెప్పాడు తమ రహస్య ప్రణయం అంతా ఇతనికి తెలుసని. తీరా ఏకాంతం వచ్చాక అతనేం చెప్పలేదు. పుణ్యకాలం కాస్తా ఏదో కబుర్లతో గడిచి పోయింది. అప్పుడు తన మనస్సు అయోమయస్థితిలో ఉంది. అతను చేసిన పనికి సంజాయిషీ అడగలేదా తను? కోపం రాలేదా తనకి? మరి అలా దూరంగా పోయిందేం అతనికి? పోనీ ప్రేమ నశించిందా? అదీ కాదే? అతని పెళ్ళి సంగతి తెల్సిననాడు తను అన్నం తినలేదు. కడుపులో శెంగ మొన్న మొన్నటిదాకా ఉండేది. ఇవేళ కూడా తన ముగ్ధప్రేమ జ్ఞాపకం వస్తే కడుపులో చెయ్యిపెట్టె కలచినట్లవుతుంది. అతను చాలా యోగ్యుడు. ఆ వేళ స్టేషన్‌కి వచ్చినప్పుడు కూడా అతన్ని వలపు ముప్పిరిగొన్న చూపులతోనే చూసింది తను. కాని అతను చలించలేదు! అతనలా బుద్ధిపూర్వంగా ఎండం అయిపోవడం ఇద్దరి మంచికీ వచ్చింది. కాని అతనికి జీవితంలో సౌఖ్యం అందింది. తను తప్పటడుగులు వేస్తోనే వుంది: ఇదంతా చేసే తనకి యం. బి. బి. యస్. లో సీటు రానేలేదు. యం. ఏ. చదవవల్సివచ్చింది!

తన ఈ ఆలోచనలో రాజు ఎప్పుడు వచ్చాడో సరిగా గమనించలేదు: ఉండి ఉండి 'ఏమిటంత దీర్ఘాలోచన చేస్తున్నావు రవణా?' అన్నాడు. ఏం చెప్తుంది తను! చెప్పే విషయాలా ఇవి? అపైన తన బ్రతుకులో ఎప్పుడో ముగిసిపోయిన ప్రకరణం గురించి చెప్పే దేమి ఉంది? జీవిత ప్రవాహంలో ఒడ్డున నడుస్తో కల్సుకున్న వారిని గురించి ఇప్పుడు తల్చుకోనే దేమిటి— మమతా వికారరహితంగా ఆ సంగతులు ఊరికే జ్ఞాపకం తెచ్చుకోడం తప్ప? రాజు పాపం తన సొంతగా ప్రేమించాడు! కాని ఇప్పుడు తన మనసులో వెంకటేశ్వర్లుని వలచి వలపించుకొన్న నాటి శాంతి లేదెందుకని?

'ఏం లేదు—ఎక్కడైనా ఉద్యోగం దొరికిందా రాజూ?'

'దొరికేటట్లుంది.'

'వెంకటేశ్వర్లు అభినందనలు పంపించాడు మన పెళ్ళికి.'

'ఏదీ ఉత్తరం?'

'అరె! చింపేశానే, పరధ్యాన్నంలో! ఏం లేదు. అభినందనలు అని.'

'ఎందుకు చింపేశావు' అన్నాడు అనుమానంగా.

## 4

మూడు నెలలు గడిచాయి. ఒక నెల టెంపొరరీ ఉద్యోగం రాజుకి దొరికి మళ్ళీ ఊడింది. అయిదో నెల రావడంమూలాన రవణ నీరసంగావుండి, దొరికినా ఉద్యోగం చేసేస్థితిలో లేదు. డబ్బుకి చాలాచిక్కులు పడుతున్నారు. నారాయణ ఆదుకోడంవల్ల ఆట్టే కష్టం అనిపించడం లేదుకాని లేకపోతే నానా అగచాట్లు పడేవారు. రవణ మొఖం పాలిపోయి, అందంఅంతా హరించి పోయింది. దానికితోడు యిరవై నాలుగు గంటలూ ఆలోచన. రాజూ నారాయణా ఆమెను ఎంత ఉత్సాహపరుద్దామని ప్రయత్నించినా ఆమెలో నిరాశ పోవడంలేదు.

ఒకనాడు రాజు మనసులో చాలా బాధపడి 'ఏం రవణా. నేను ఆదిలోనే చెప్పినట్లు నాతో విసుగెత్తిపోయిందా? అస్తమానూ అలా వుంటావు?' అన్నాడు.

రవణ సమాధానంగా హోరున ఏడ్చింది. రాజు నిలువునా నీరైపోయాడు.

ఒకనాడు ఒక ఉత్తరం వచ్చింది రాజుకి.

# ★ రాగముక్త ★

ఆడవాళ్ళ దస్తూరీ చూసి రవణ కుతూహలం కొద్దీ ఆ కవరు చింపింది. అది రాజు భార్య రాసింది.

"మహారాజశ్రీ......గారి పాదములకు సత్యవతి నమస్కరించి వ్రాయునది.

మిమ్మల్ని నేను ఎప్పుడూ కల్లోకో లేదు. కాని ఎప్పుడో అప్పుడు కల్సుకుంటావనే ఆశతో ఆరోజుకోసం ఎదురుచూస్తున్నాను. నేనేం నేరం చెయ్యలేదు. మరి నాకు శిక్ష ఎందుకు వేస్తారు మీరు? మీకు మాత్రం తెలియదా? కాని ఈమధ్య మిమ్మల్ని గురించి మావాళ్లు ఏవో చాలా చాలా చెప్పారు. ఇక నన్ను మీరు తీసుకెళ్ళరని చెప్పారు. కాని నేనలా అనుకోడం లేదు. ఏ నేరం చెయ్యని నన్ను మీలాంటి మంచివారు ఈవిధంగా శిక్షించరనే నమ్ముతూ, మీ సన్నిధికి తీసుకు పొండని ప్రార్థిస్తున్నాను. మీ కే పరిస్థితుల్లో ఉన్నా మీతో గడపడానికి నేను సిద్ధం.

ఇట్లు, మీపాదదాసి సత్యవతి.

ఈ ఉత్తరం చదివి రవణ కుర్చీలో అలాగే కూలబడిపోయింది. అమాయికమైన ఆ ప్రార్థనా జీవితం అంటే తెలియని అస్పష్టి నమ్మకం చూసి రవణ హృదయాంతరాళం కంపించిపోయింది. అయితే దీని కంతకీ ఎవరు బాధ్యులు, అనే ప్రశ్న రవణ మనసుకి రాకమానడం లేదు. మానదు. ఆ ప్రశ్నకి సమాధానం ఎవరో ఒకరు చెప్పాలి. చెప్పి తీరాలి. తన మట్టుకు తనని అడిగితే ఏం చెప్తుంది? 'రాజుని ప్రేమించడం నాతప్పా?' అని ఎదురు ప్రశ్న వేస్తుంది. కాని ఆమె ఆత్మ ఒప్పుకోదు.' "తెలిశాక కూడా అతనికిఎందుకు దూరంగాపోలేదు." అంటుంది. దీనికి సమాధానం చెప్పాల్సిన వాడు రాజు.

ఇంతలోకే రాజు వచ్చాడు. 'నీ కెన్ని సార్లు చెప్పినా మానడంలేదు. నువ్వు ఉల్లాసంగా వుండాలి రవణా.'

రవణ ఈ ఉత్తరంచేతి కిచ్చింది. అత నది చదివి ఏం మాట్లాడలేదు.

డాక్టరు నీకేవో టానిక్సు ఇమ్మన్నాడు- ఇస్తాం అనుకో ఎలాగో తెచ్చి. కాని నువ్విలాగే వుంటే అవే మీ పని చెయ్యవు. అసలీ దిగులు ఏమిటో ఎందుకో అర్థం కాదు.' అన్నాడు.

'నాకేమిటో భయంవేస్తోంది రాజూ' అని దగ్గరగా జరిగింది రవణ.

'ఛా. నువ్వొక్కర్తవేకన్నావా? మొదటి కాన్పుకి ఊరికే అలా భయంగా వుంటుందంటే - చదువుకున్న ఆడవాళ్లకి కాన్పుఅంటే మరీ భయం - ఎందుకూ భయం?'

మర్నాడు ఏమాలోచించుకున్నాడో రాజు సత్యవతిని తీసుకోస్తానని బయలుదేరి నాలుగో నాటికల్లా ఆమెతో తిరిగి వచ్చాడు. రవణ నిశ్చేష్టురాలైంది. సత్యవతి రవణ అంత అందంగా ఉండదు. కాని ఫర్వాలేదు, ఓమోస్తరుగా వుంటుంది. ఆమె కళ్లలో కన్యాత్వపు ముగ్ధరోచిస్సులు, శరీరంలో లావణ్యం ఇంకా పోలేదు. రాజు ఆమెకి ఏం చెప్పి తీసుకొచ్చాడో కాని ఆమె తన అన్ని చీరలూ, నగానట్రా అన్నిటితోనూ వచ్చింది.

క్రమంగా రవణకి ఏడో నెలకూడా వెళ్ళిపోతోంది. కొంచెం భారంగా తిరుగుతోంది. సత్యవతి ఈ రెండు నెల్లోనూ రవణకి కావల్సిన పనులేవో ముభావంగా చేసి పెట్టడం తప్ప ఎప్పుడూ చనువుగా మాట్లాడలేదు. అలాగని విరోధమూ లేదు. రవణమాత్రం అంతులేకుండా ఆలోచించేది ఆమెనుగురించే. ఒకనాడు రాజు పెద్ద పెద్ద కేకలు వేస్తున్నాడు. 'సెలక్షను దటే గాదండీ నాగోలుకు అమ్మేశాచి. అప్పుడే అయిపోయాయా? ఆచీర మంచు పట్టుచీరండీ, మనసుపడి కొనుక్కున్నది. నగలేం లేవుకాని ఉంటే ఈచీర ఇచ్చే

వాన్నీ.' అంటోంది సత్యవతి.

అప్పులకీ, నిత్యఖర్చులకీ ఆమె నగలు అయిపోయాయన్నమాట - 'అది రవణకి ఇప్పుడే తెల్సింది. రవణ చూస్తూండగానే రాజు ప్రవర్తన మారిపోయింది. సత్యవతిని క్రూరంగా చూస్తున్నాడు. ఉద్యోగం కూడా లేని మూలాన ఆమెనగలూ చీరలూ లాక్కుని కర్చుపెట్టేశాడు. సత్యవతి ఒక్కనాడూ రవణతో ఫిర్యాదు చెయ్యలేదు. రవణ ఏమీ చెయ్యలేదనే ఊరుకుందో, లేక ఆమె ఇవన్నీ చేయిస్తోందనే ఊరుకుందో, లేక ఫిర్యాదు చెయ్యడం పాతివ్రత్యం కాదనుకుందో!

ఒకనాడు రాజు సత్యవతిమీద చెయ్యి చేసుకోబోతుండగా రవణ వెళ్లింది. భయపడిన వాడిలా దూర దూరంగా పోయాడు రాజు. రవణ ఏం మాట్లాడకుండా తన గదిలోకిపోయి మంచంమీద కూలబడింది.

ఇటువంటి దృశ్యాలు చూడలేక ఆఖరికి ఒకనాడు అడిగింది,' ఎందుకు రాజూ ఆ పిల్లని అలా బాధపెడతావు పాపం'! అని.

'నీకోసమే' అన్నాడు.

'ఆపాపం నాకక్కర్లేదు' అందిచురుగ్గా.

తర్వాత నెమ్మదిమీద తెల్సింది దానిలో అంతరార్థం - తను పెళ్ళిఖాయం చేసుకునేందుకు, సత్యవతిచేతే విడాకులకు అర్జీ పెట్టించే పరిస్థితుల్లో ఆమెని పెట్టాలని ప్రయత్నంట అది! తమ పెళ్ళి ఎవరి దృష్టిలోనూ పెళ్ళికాదనే బెదురు రాజాకే ఉందనీ, ఎలాగైనా కోర్టుద్వారా ఆమెతో విడిపోయి రవణనే భార్య అందామని అతని తాపత్రయం అనీ, రవణ నెమ్మదిగా గ్రహించింది. రవణకి దుఃఖంభయం ఒక్కసారే కల్గేయి. ఇతని పట్టిగాని, ఇంతల్లో ఆ అమ్మాయి, కాపరం వదులుకుంటుందా? ఆడవాళ్ళ మనసులు తెలియవు గదా - తనూ ఆడదే - ఏమో ఆ అమ్మాయి అన్నలూ తండ్రీ ఏమన్నా చెయ్యాలేమో కాని, అదీ అనుమానం.

మరోనాడు సత్యవతిని రాజు కొడుతున్నాడు. రవణ అక్కడికి వెళ్లగానే అతనక్కడనుంచి వెళ్ళిపోయాడు. రవణ మనస్సు కుదిపినట్లయిపోయింది.

ఉండబట్టలేక 'మీ పుట్టింటికి వెళ్లిపోతావా?' అని అడిగింది.

'నేవెళ్లను' అంది సత్యవతి.

'ఈబాధలన్నీ నీకింకా చాలేదా? వెళ్లు. నామాటవిను - నీకాపరం వొదులుకోమంటున్నాననుకోకు - దీనికి నేనెంతమాత్రం కారణం కాదు. పుట్టెడు ఆపద ముందు పెట్టుకు చెప్తున్నాను. నువ్వంటే నాకేం అక్కు లేదు. కాని నేనీ ఘోరం చూడ్లేకుండా వున్నాను. నాదగ్గిర కొంచెం డబ్బుంది. మీ అన్నకి టెలిగ్రాం ఇచ్చి ఇవేళే బయలుదేరు.' ఈ మాటలు గబగబా అనేసి వగుర్చుకుంటూ అక్కడవున్న కుర్చీలో చదికిలబడింది రవణ. సత్యవతి రవణలోని ఈ ఆకస్మిక ఆవేశానికి వింతపడి తెల్లపోయి నుంచుంది. ఆమె తనతో ఇన్నిమాటలు మాట్లాడ్డం ఇదే ప్రథమం! సాయంత్రం రాజు ఎక్కడికో పోగానే తన గుడ్డలు నాలుగూ సర్దుకుని రవణ ఇచ్చిన డబ్బు తీసుకుంది సత్యవతి-నువ్వొక్కర్తివెలా వెడతావు. నీకు తెలీదే. పద నేనూ వస్తానంటూ కూడా బయలుదేరింది రవణ. 'మాలాలివి వద్ద'న్నా విన్పించుకోలేదు.

రైలు బైలుదేరేముందు రవణ చెప్పిన ముక్కలివి. 'టెలిగ్రాం ఇచ్చా మీ అన్నకి స్టేషన్కి రమ్మని. భయంలేదు. కాని మళ్లీ

(54 వ పేజీ చూడండి)

# పబ్లిసిటీ

బుష్‌కోటు నడుస్తూంది. బుష్‌కోటు మీద ప్రేయసీ ప్రియులు గాలిలో తేలిపోతున్నారు. అలల మధ్య పడవల్లా ఆ నాగరీకుని వీపుమీద నాట్యం చేస్తున్నారు. 'సర్వం విష్ణుమయం జగత్' అన్నట్టు, ఎటువైపు చూసినా అటువంటి బుష్‌కోట్లే! వాటి మీద ఆ ప్రేయసీ ప్రియులే!

'హుం మారిపోతూంది లోకం' అనుకున్నాను ఎదురుగా ఛాతీ విరుచుకొని వస్తున్న యువకుణ్ణి చూసి. అతని గుండెలమీద నిర్భయంగా ముద్దుపెట్టుకొంటున్న నాయికా నాయకుల్ని చూసి నవ్వుకున్నాను. ట్వెంటియత్ సెంచరీ బీ. సి. లో వుండాల్సిన నావంటి మఫ్స్ యింకా ఆ మహానగరంలో వుంటున్నందుకు కాబోలు అసహ్యాన్ని వెలిబుస్తూ వెళిపోయాడా యువకుడు.

మెల్లిగా నడుస్తున్న నన్ను దూసుకుపోయింది, హైహీల్సు షూష్‌మీద అయిదడుగులు పాడవున్న ఓ హంసగమన. జంటలగా పోతున్నారు దంపతులు. వింతగా షాపులవైపూ రోడ్లవైపూ భవనాలవైపూ చూస్తున్నారు కొందరు, ఆ పరిసర ప్రాంతాలనుండి ఆ మహానగరం చూసి జన్మ తరింపజేసుకోవడానికి వచ్చిన యువకులు. సెమీ సూట్లూ, ఫుల్ సూట్లూ, బుష్ కోట్లూ, గౌన్లూ, చీరలూ వస్తున్నాయి వెళ్తున్నాయి. వాక్సాల్, మోరిస్, ఆస్టిన్, ఫోర్డ్, స్టుడెబేకర్, ప్లిమత్ యింకా ఎన్నో ఎన్నో కార్లూ, ట్రాంలు వింత వింత శబ్దాలతో అటూ యిటూ పరుగెడుతున్నాయి.

వేగంగా వస్తున్న ఆ మోటారు సైకిల్‌కి నేను 'సెంట్రల్ కేఫ్' పక్క నుంచి పోతుండగా టక్కున బ్రేక్ పడ్డది. ఆలోచనలకి సడెన్ బ్రేక్ వేసి ఆగిన మోటారు సైకిలు మీదున్న ఆసామీ వైపు చూశాను. చూసి అతను రామారావు కాదేమో ననుకొని మళ్ళీ ఒకసారి జాగ్రత్తగా చూశాను అవును రామారావే!

సుందర్ సోపు మేన్యుఫాక్చరింగ్ కంపెనీ పబ్లిసిటీ ఆఫీసర్ రామారావ్.

వచ్చే నూట ఏభై రూపాయలతో నాలాగే ఆమహానగరంలో కష్టంగా కాలం గడుపుతున్న నా ఆప్తమిత్రుడు రామారావ్.

వాడికొచ్చే జీతంతో మోటారు సైకిలుకు పెట్రోలు కొనగలడా? పోనీ ఎరువుగా ఎవరిదగ్గరైనా తీసుకొన్నాడేమో అనుకోటానికి నిన్న మొన్నటివరకు వాడికి మోటారు సైకిలు నడపడం రాదే!

'ఎప్పుడు రావటం యింటి నుండి?' అన్నాడు రామారావ్.

'ఉదయమే!'

'అందరు బాగున్నారా?'

'ఆ!...కాని నువ్వు మోటారు సైకి లెప్పుడు కొన్నా' వన్నాను. తెలుసుకుందామనే ఆసక్తి కొద్దీ.

'అ అయితేరా చెప్తాను' అంటూ రామారావు ఎదుటనున్న 'సెంట్రల్ కేఫ్' లోకి నడిచాడు. అనుసరించాను.

## "కీర్తి ప్రియ"

లోపల చాలా హడావిడిగా వుంది. స్త్రీ, పురుషవ్యత్యాసం లేకుండా పకపకలు, వికవికలుతో టిఫిను తింటున్నారు. కాఫీలు తాగుతున్నారు. మెల్లగా సంభాషణ కనువుగా వుండే ఒక మూలనున్న టేబిల్ దగ్గరకు వెళ్లాను. ఇద్దరం తిష్ట వేశాం.

'టూ ప్లేటు రసగుల్లా' అన్నాడు వచ్చిన సర్వర్‌తో రామారావ్.

'నీవు లీవుపెట్టి యింటికి వెళ్ళి ఎన్నాళ్లయింది' అనడిగాడు నన్ను.

'మూడు నెలలు. నాగోడవంతా చెప్తాగాని ముందునీ మోటారు సైకిల్ సంగతి చెపుదూ, వినాలని చాలా కుతూహలంగా వుంది.'

'ఏముంది. ఆ మధ్య నాలుగయిదు మాసాల క్రిందట నీతో చెప్పంటాను. మా కంపెనీ దివాలా తీసేస్థితిలో వుందనీ, నా వుద్యోగం ఊడేటట్టుందనీని. జ్ఞాపకముందా?'

'ఆ! ఒకనాడు మేనేజరెదో గొడవ పెట్టాడన్నావ్.'

'గొడవా? ప్రయివేటు రూములోకి పిలిచి బండబూతులు తిట్టేనూ. 'నా బి. య్యే దమ్మిడీకి మారదన్నాడు. 'కనికరించి వుద్యోగమిస్తే తిని కూర్చుంటున్నావా? అన్నాడు. పబ్లిసిటీ లోపంవల్ల వ్యాపారమందగిస్తే వెంటనే యింటికి దారితీయాల్సిందే' నన్నాడు.

'సర్వర్ రసగుల్లా తెచ్చి ఎదుట పెట్టాడు.

'ఆ విషయం నీతో చెప్పిన మర్నాటి నుంచీ ఆలోచించాను, వుద్యోగం ఎలా నిలబెట్టుకోవడమా అని. మూడురోజులు పోయాక ఓ ఆలోచన తట్టింది. మర్నాడు ఆఫీస్‌కు వెళ్లిన వెంటనే మేనజర్ని కలుసుకున్నాను. పబ్లిసిటీకి ఓ తౌజండ్ రుపీస్ సేంక్షన్ చేయమన్నాను. మొదటలో చిర్రుబర్రు మన్నాడు. సంగతి వివరంగా చెప్పాను.' అని రామారావు స్పూన్‌తో కొంత రసగుల్లా నోట్లో వేసుకున్నాడు.

'ఆ సంగతేంటో నాకు కూడా కాస్త వివరంగా చెపుదూ' అన్నాను తింటూ వింటూన్న నేను.

'నా ప్లాన్ ఏమిటంటే, యీ మధ్య వస్తున్న ప్రతి పిక్చర్‌లోనూ దర్శనమిస్తున్న 'బిజిలీ' వుంది కదూ? ఆవిడ మా 'సుందర్ సోప్' వాడుతున్నట్టూ అందువల్ల ఆమె అందం దినదిన ప్రవర్ధమానం అయిపోతున్నట్టూ ఓ టెస్టిమోనియల్ ఆవిడ ఫోటోతోపాటు ముద్రింపించిన బుష్‌కోటు బట్ట 'అరుణా మిల్సు'లో తయారు చేయించడం, ఆబట్ట హోల్‌సేల్ డిస్ట్రిబ్యూషను మా కంపెనీ తీసుకోవడమున్నూ.'

రసగుల్లా కానిచ్చేసి వచ్చిన సర్వర్‌కి పకోడి ఆర్డరు యిచ్చి మళ్ళీ ప్రారంభిచాడు రామారావ్.

'ఆ మేనేజరు మనసులో సంతోషించినా పైకి కనపడనీకుండా అవన్నీ అరేంజ్ చేసుకురమ్మన్నాడు. ఆ సాయంత్రమే 'బిజిలీ' యింటికి వెళ్లాను. ఆవిడ యింట్లో లేదు. చాలా ఎంగేజ్ మెంట్సుంటున్నాయట. రోజుకి అయిదారు గంటల కన్నా ఎక్కువ నిద్రపోవడానికి కూడా టైమ్ చాలడం లేదట. ఆదివారం సాయంకాలం మూడున్నరా, నాలుగు గంటలకొస్తే కలుసుకోవచ్చని చెప్పారు. ఆరోజుకి వచ్చేశాను.'

'ఆదివారం సాయంత్రం మేనేజర్ దగ్గిర పుచ్చుకొన్న పైసా జేబులో వేసుకొని బిజిలీ యింటికి వెళ్ళాను. ఆవిడ బీచ్ షికారుకి కాబోలు అప్పుడే బయలుదేరుతూంది.



ఆలోచనలకి సడన్ బ్రేక్ వేసి ఆగిన మోటారుసైకిలు మీదున్న ఆసామివైపు చూశాను. అతను రామారావే!

విషయం తెలియజేసి టెస్టిమోనియల్ మీద సంతకం చేయమన్నాను. ఓ వెయ్యి రూపాయలిమ్మంది. అతికష్టంమీద అయిదువందల రూపాయల కొప్పించి పైసా చెల్లించి ఆవిడ సంతకం పెట్టించాను. ఆవిడదగ్గరున్న రకరకాల ఫొటోలలో 'వెకై' బుష్‌కోట్ తొడుక్కొని తీయించుకొన్న ఓ బస్ట్ ఫోటో ఆమెది తీసుకొన్నాను.'

పకోడీ కాస్త తిని మళ్ళీ ప్రారంభించాడు.

'ఆమర్నాడు 'అరుణా మిల్స్' వారిదగ్గరకు వెళ్లి బుష్‌కోట్ బట్టనుగురించి మాట్లాడాను. వాళ్లు బట్టంతా మీ కిచ్చేయడానికి అభ్యంతరంలేదు గాని మీరు దానిని అమ్మడానికి లైసెన్సుపీ సంపాదించాలన్నారు. అవన్నీ మేం చూసుకుంటామని ఒప్పించి అయిదు వందలు ఎడ్వాన్సుకింద పే చేసి అగ్రిమెంటుమీద సంతకాలు చేయించాను. అయిదు వేళ్లగుడ్డ పదిహేనురోజులలో తయారయివచ్చింది. ఈలోగా మా కంపెనీవాళ్లు బట్ట అమ్మడానికి లైసెన్సు సంపాదించారు."

"ఇంకేముంది నెలతిరక్కుండానే బుష్‌కోట్ బట్ట బజారులోకి వచ్చింది. బుష్‌కోట్ తొడుక్కొన్న బిజిలీ బొమ్మ! దానికింద బిజిలీ టెస్టిమోనియల్! అన్ని ముఖ్యపట్నాలలోను చిల్లర వర్తకులకమ్మేశాం. మార్గదర్శకుడొకడుండాలని చూడడానికివచ్చిన మాబావమరిదిచేత ఓ బుష్‌కోట్ వేయించి రెండు రోజులు మెయిన్ రోడ్లమీద తిప్పాను. మూడవరోజుకల్లా టౌన్‌లో ప్రతినాగరికుడి శరీరంలో అర్ధభాగంమీద—

"బిజిలీ చెప్పాదున్నది." నా సౌందర్యాన్ని కాపాడుకోడానికి నే నెల్లప్పుడు 'సుందర్ సోప్' నేవాడుదును' అని ముఖ్యమయిన మూడుభాషల్లోనూ బిజిలీగారి సుందర ముఖారవిందంతోపాటు ప్రత్యక్షమయింది. రోడ్డుమీద నువ్వు చూసుండాలే మేం తయారుచేయించిన బుష్‌కోట్ బట్ట" అని ప్రక్కని నిలబడిన సర్వర్‌తో 'కాఫీ' అన్నాడు రామారావ్.

"ఆ! ఎవడో ప్రేయసీ ప్రియులున్న బుష్‌కోట్‌బట్టను వేసుకొంటే, అన్ని బుష్‌కోట్లూ అలాంటివే అయుంటాయని అంతగా వాటివైపు చూడలేదు. ఎవరో ఒకావిడ గౌనుమీదకూడా చూశాను. ఏవో బొమ్మలు."

"ఆడా, మగా అని ఆలోచించక్కర పత్రలూ, లేదు. ఇప్పుడు అందరికీ అవే రక్షణ ఆకర్షణ పత్రాలూనూ" సర్వర్ తెచ్చిన కాఫీపుచ్చుకుంటూ అన్నాడు.

"ఇంతకీ మోటార్ సైకిల్ సంగతి చెప్పావు కాదు."

"ఇంక వూహించుకో లేవూ? మోటార్ సైకిల్ ఎలావచ్చుంటుందో."

"ప్రజంటేషనా'?

'ఇంచు మించు మూడునాలుగు వేల వరకు బట్ట అమ్మకంలోనే మా వాళ్లు లాభంతీశారు. అందుచేత పబ్లిసిటీపనులకోసం ఓ మోటార్ సైకిల్ కొని, నాజీతం రెండు వందలు చేశారు.'

"క్లాతేవన్న మాట ఛాన్స్' అన్నాను సంతోషంగా.

(56-వ పేజీ చూడండి)

# ఏనాటమీ థియేటర్లో

చందన్

బలవంతంగా వైరాగ్యం అలవర్చుకోవలిస్తే నాలుగు శవాల్ని ఒకేమారు చూడమన్నాడు, వెనకటికి ఓ తత్వవేత్త నాలుగు కాదు, నాలుగుమీద పది శవాల మధ్య కూర్చున్న మాకు వైరాగ్యం సంగతేమిటో తెలియదు అంతే కాదు అవి శవాలని మాకు అసహ్యం వుండదు భయమూ వుండదు అయినా అదేమన్న మాట! వైరాగ్యతత్వం బుర్రలో ఎక్కి ఆలోచనల్లో పడ్తే ప్రొఫెసర్ వూరుకుంటాడా?!

ఏనాటమీ థియేటర్లో స్టూల్ మీద కూచుని కత్తికటారులు బల్లమీదికి విసిరి 'యీ వేళ నువ్వు చేయరా డిస్సెక్షన్' అన్నాడు నా పార్ట్నర్ విశ్వనాథం వాడికి ఒళ్లూ బద్ధకం కూడా పెరిగిపోతున్నాయి

'యీ వేళ నీ టరన్ రా నేను చేయను' అన్నాను, లాంగదీర్ఘామనే ధీమాతో. కేబురుమాలుతో మొహం తుడుచుకుంటూ తలెగరేశాడు ఏమిటో వాడి అభిప్రాయం? 'తంపుతున్నావురా మిస్టర్' అంటూ లేచి, స్కాల్ పెల్, ఫోర్సెప్స్ తీసుకుని 'ఊఁ చదవరా' అన్నాడు పుస్తకం విప్పాను

థియేటర్ అంతా గోలగా వుంది ముఖ్యంగా పైకార్నర్ లోంచి తీవ్రమైన సంచలనం వినవస్తోంది అక్కడంతా ఆడవాళ్ళు! అంతమందిలో సావిత్రి ఓమూల కూచుని పుస్తకం చదువుకుంటోంది ఎదురుగుండా 'ట్రే'లో లివర్ వుంది

'వాడికి ఆయిల్ రాసినట్లు లేదురా వాసన వేస్తోంది' అన్నాడు విశ్వనాథం 'బాడీ' అంటే మనకేం కాదు శవానికి మరో పేరు. నిజమే! బాడీ ఎండిపోతోంది ఎండిపోయిన జీవితాలకి మల్లే ఎండిపోయిన శవాలంటే అందరికీ రోత!

'ఒరేయ్ యీ వేళ రేపట్లో తాజా బాడీలు వస్తే మనం చెప్పి తీసుకుందాంరా' అన్నాడు అశుభం శాంతించుగాక, అనుకున్నాను మనసులో ఏడి కోరిక ప్రకారం కింగ్ జార్జి హాస్పిటల్లో ఓ అభాగ్యుడు మాకోసం చావాలన్న మాట!

'అయినా కొత్తబాడీలు వస్తే మనదాకా వస్తాయేమిట్రా యిప్పటికే చాలుండి తెరుకొట్టివున్నారు' అన్నాడు ఆకార్నర్ కేసి చూచి, స్కిన్ ఫ్లాప్ తీస్తూ ఏడి తెలివి గాని, అమాత్రం అభిమానం లేకుండా యీ ప్రపంచం ఎలాగ నడవగలుగుతుందంటాను!

'యీ ప్రపంచంలో కొన్ని విషయాలనుగూర్చి మనం అతిగా ఆలోచించకూడదురా మనకు పట్టనట్లు వదిలేయాలి' అన్నాను 'యస్ యస్,' అన్నాడు తలెగరేసి నవ్వుతూ

ఎప్పుడో మాటల సందర్భంలో పుస్తకం మూసుకుపోయింది విప్పి పది పంక్తులు చదివి వినిపించాను. విశ్వనాథం పొట్టలోకి చేయి పోనిచ్చి స్ప్లీన్ పట్టుకుని దాని ఆర్టిరియల్ సప్లై వెదికి శుభ్రపరచడంలో లీనమయ్యాడు రక్తనాళం ప్రక్కన యింకొక రక్తనాళం! అవి కూడ యీ జీవితపు సమస్యల్ని అర్థంచేసుకో ప్రయత్నిస్తున్న వేదాంతులకిమల్లే అవుపిస్తుంటాయి నాకు ఎక్కడి అరోరాప్పా! అక్కణ్ణించి బయలుదేరి దారిలో మజిలీలు చేసుకుని, మంచీ చెడ్డా చూసుకుంటూ ఎంతదూరం పోతాయని! వాటిలో అహం లేదు అంతా పరోపకారమే పోయి అనేక భాగాలకు సప్లై చేసి, అప్పుడు తృప్తితో కాపిలరీస్ రూపంలో విస్తరించిపోతాయి అంతే దాని జీవితం వినా ఎంతో క్రమతో కూడుకున్నది!!!

సన్నగా నవ్వు వినిపిస్తోంది దూరం నుంచి శవాలమీదుగా దూరాన్న రమాదేవి కనిపిస్తోంది ఎల్లప్పుడూ నవ్వు! అర్థంలేని అభిప్రాయాలతో జీవిస్తున్న మానవులంటే నాకెంత అభిమానమో, రమాదేవి అంటే కూడ అంతే అభిమానం

'డామిట్ తెగిందిరా' అని ఓ చిన్ని పొలికేక పెట్టి స్కాల్ పెల్ బల్లమీద పడేశాడు విశ్వనాథం

'చేయి కాదుగదా!' వులిక్కిపడి లేచి నుంచున్నాను అనుకున్నంత పని కాలేదు ఆర్టరీ ఒకటి తెగింది ఎర్రగ చిందుకుని వస్తోంది తెగిన రక్తనాళంలోంచి విశ్వనాథానిది పదునుచేయి ఎప్పుడూ యింతే వాడి చేయి పడిందంటే నరాలూ, రక్తనాళాలూ గోలపెడ్తాయి అన్నిటినీ కోసేస్తాడు

'ఒరేయ్ మిస్టర్ బాడీ ఎండిపోయిన మూలాన్న స్ట్రెక్చర్ సరిగా రావడం లేదురా' అన్నాడు అఘోరించావులే, అనుకుని, 'పర్వాలేదులే ఎలాగా స్ప్లీన్ తియ్యాలిగా జాగ్రత్తగ తీయి' అని నచ్చచెప్పి చదివి వినిపించాను మళ్లా 'స్కాల్ పెల్' పుచ్చుకుని 'కోత'లోకి దిగాడు విశ్వనాథం నేను స్టూల్ మీద కూచుని గడియారం కొట్టే గంటల్ని లెక్కపెడ్తుంటే భుజంమీద భారంగా చేయిపడగా వెనక్కి తిరిగాను సదాశివం! సదాశివం నవ్వుతూ వచ్చి స్టూల్ మీద కూచుని - 'దొరికిపోయాడ్రా మాధవ్ గాడు' అన్నాడు నాకు అర్థంకాలేదు విశ్వనాథం డిస్సెక్షన్ మానేసి సదాశివంకేసి చూస్తున్నాడు

'ఏం జరిగిందిరా' అని అడుగుదామనుకున్నాను కాని ఏదు సదాశివం అడగక్కర్లా తనే ప్రారంభించాడు 'విన్నావట్రా మాధవ్ గాడు నిన్న పిక్చర్ కి వచ్చాడు ఒక్కడూ కాదు లైలాతో సహా' నవ్వుతున్నాడు ఆ నవ్వులో బాధ అసహనం అనుమానం తెరంగాలమల్లే లేస్తున్నాయి లేదు హృదయాల్లోని బాధని బైటికి తెలియపరుస్తావుంటే గాని చాలమందికి మనశ్శాంతి వుండదు మాధవరావంటే మా సీనియరు అయితే లైలా యెవరు? వినా మన కెందుకని - 'వాడికి ధైర్యం వుందిరా' అన్నాను విశ్వనాథం బాడీ తొడమీద 'స్కాల్ పెల్' గుచ్చుతూ 'ధైర్యం కాదురా మిస్టర్ వాడికి కారు వుంది' అన్నాడు 'అఁ - అదీ అదే' అన్నాడు లేచి వెళ్ళిపోతూ సదాశివం. విశ్వనాథం వాడు వెళ్ళినవంక చూస్తూ 'పాపం! యితకాలంలో వస్తాడా' అన్నాడు

'ఎవర్రా ఆ లైలా' అని అడిగాను,

ఆమాత్రం తెలీదా - అన్నట్లు నావైపు చూచి నవ్వాడు విశ్వనాథం.

థియేటర్ అంతా నిశ్శబ్దమయింది. విశ్వనాథం ఎబౌ మెన్ లోకి చెయిపోనిస్తూ 'ఊఁ-చదవరా మిష్టర్. ప్రొఫసర్ వస్తున్నట్లున్నాడు' అన్నాడు. మూసినపుస్తకం విప్పి తీక్షణంగా చదువుతున్నట్లు నటిస్తూ ఆలోచిస్తున్నాను. మెడికల్ కాలేజీకి రావడమే ఎంతోమంది కొంగ్రొత్త అభిప్రాయాలతో వస్తుంటారు. ఎందుకో ఆ గ్లామర్! అదయినా ఎంతకాలమని! యితరుల సమస్యల్ని మనవిగా అర్థం చేసుకోవడం లో తృప్తివుండొచ్చుగాని, మనశ్శాంతి వుండదుగదా - మాధవరావు తన లైలాతో పిక్చరుకు పోతే మధ్య వీడికెందుకో ఆబాధ. జీవితపు విలువలు తెలుసుకోలేని మానవుడు!

కళ్ళద్దాలు సర్దుకుంటూ ప్రొఫెసర్ అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నాడు. అంతా గప్ చిప్. కొర్నర్ వాళ్లంతా మహాబుద్ధిమంతులై పోయారు. గుసగుసలు... వికిలినవ్వులు దాచుకున్నారు. విశ్వనాథం కంగారు చూడాలి. చెమటపోర్తున్న మొహంతో, పేగులు అటూయిటూ కలగాపులగం చేస్తున్నాడు. ఏమిటో వాడి అభిప్రాయం! మనం చేస్తున్నది స్ప్లీన్‌రా'అన్నాను.

'నా మొహం...ఏదిరా అవుపించడం లేదు'అన్నాడు కంగారుగా. నాకు నవ్వు వచ్చింది. అణుచుకుని లేచి నిలబడి చూశాను. నిజమే! వుండాల్సినచోట లేదు అది. ఏమయిందా అని - ఆశ్చర్యపోతూ ప్రక్కకి తిరిగేటప్పటికి నాకు నవ్వాగిందికాదు. హారి! విశ్వనాథం దాన్నెప్పుడో డిటాచ్ చేసి మాటల సందర్భంలో బల్ల మీద పెట్టేశాడు. 'అదిగోరా.' అని చూపించాను.

'ఓ...సారీ! అంటూ తీసి దాన్ని మళ్లా యధాస్థానంలో పెట్టేసి తాపీగా నిట్టూర్చాడు. యీలోగా మామూలు సద్దు ప్రారంభమయింది; ప్రొఫెసర్ వెళ్లిపోవడంతోనే-

అమ్మయ్యా - అంటూ స్టూల్ మీద కూచుని 'ఎవ్వరా...ఆలైలా' అని అడిగాను. విశ్వనాథం తెలెగ్గిరేసి నవ్వుతూ 'అదేరా...సదాశివం వూరమ్మాయి. మన క్లాసుమేటు'అన్నాడు. ఓ! యిందుకా సదాశివంగాడికీ అసహనం.

'నిజంగా వాసంతి మాధవరావుతో పిక్చరుకు వెళ్ళిందా' అని అడిగాను.

'అదంతా ఓనాటకం లేరా. సదాశివాన్ని ఏడ్పించడానికి ఎవరో చెప్పి వుంటారు. వాడు పడేబాధ చూశావుగా. వాణ్ణి ఏడ్పించాలంటే అందరికీ సరదా' అన్నాడు విశ్వనాథం.

'అయినా...వాడందరికీ చనువు యిస్తాడా' అన్నాను.

'చనువు ఏమిట్రా - నీకేంటంది' అని విశ్వనాథం స్టూల్ మీద కూచుంటూ 'వేషవేషాలు వేస్తుంటే ఎవళ్ళకి కోపంరాదురా. లేడీస్ లోకూడ వాడికి చెడ్డపేరు వుంది తెల్సా'అన్నాడు. నాకు ఎలాగో అనిపించింది. 'ఏం-' అన్నాను.

విశ్వనాథం యివ్వాల్టికి చాల్లే-అన్నట్లు కత్తికత్తెరలు బల్లమీదపడేసి 'అది కాదురా మిష్టర్. సదాశివంసంగతి నీకు తెలీదుగామోసు. ఆ వాసంతివుందా, యిద్దరిదీ ఒకేవూరు. వాసంతికి తను లోకల్ గార్డియన్ అయినట్లు వ్యవహరిస్తుంటాడు వీడు. ఆవిడతో మన మెవరం మాట్లాడకూడదట. మాట్లాడితే వీడికి మంట. అర్థమయిందా?

చూడు, యింతాచేసి వాసంతి వీణ్ణి లెక్క చేయదు. పాపం. వీడిది అఘోరకం మనస్తత్వంలే.' అంటూ గేటువైపు చూసి ఆగాడు. తోటేలు బాడీని మోసుకువస్తున్నారు. ఎవడీ అభాగ్యుడు! తెచ్చి మా ఎదురు వరుసలో మూడో టేబిల్ మీద పెద్దశబ్దంతో పడేశారు. విశ్వనాథం ముందుకు వంగుతూ - 'మనకీ బాడీ' 'ఎలాట్ చేస్తే బావుండునురా - స్ట్రక్చర్స్ బాగా వచ్చేవి'అన్నాడు. యిక బాడీకోసం వేట ప్రారంభం. నాకు తెల్సినంతమట్టుకు ఆ అభాగ్యుడి ఆత్మ యింకా పరలోకానికి పోయేత్రోవలోనే వుండివుంటుంది. అప్పుడే యిక్కడ వాణ్ణిపంచుకుని కోద్దామనుకుంటున్నారు. పైకొర్నర్ లో సంచలనం తగ్గి, కొంతమందివచ్చి నించుని ఏ పోర్షన్ చేయడమాయని తర్జన భర్జన చేసుకుంటున్నారు. సావిత్రి కళ్ళల్లో బాడీ మీద సానుభూతి అవుపిస్తోంది. ఏమిట్లో? ఆవిడ కళ్లు చూస్తుంటే నాకు ఏమిటేమిటో జ్ఞాపకం వస్తుంటాయి. 'తుపానులో తడిసిన, జడిసిన గోమాతల తమ్ములు' అని శ్రీశ్రీ యీవిడ్ని చూసిం తరువాత రాసాడా - అనిపిస్తుంటుంది నాకు... కాని నా అభిప్రాయం నిజంకాకపోవచ్చు.

విశ్వనాథం కళ్ళు బాడీమీదలేవు. విచ్చలవిడిగా విహరిస్తున్నాయి. వాసంతీ... లావణ్యా అప్పుడే అసిస్టెంటు ప్రొఫెసర్ రూంలోకి వెళ్తున్నారు, బాడీ ఎలాట్మెంటుకోసం, ఉద్దండులు! 'ఒరేయ్ మిష్టర్. మనం పైభాగం చేద్దామా' అన్నాడు విశ్వనాథం - సావిత్రి తన జాగాకి వెళ్లి స్టూల్ మీద కూచుని పుస్తకం విప్పి చదువులో నిమగ్నమయింది. విశ్వనాథం నాకళ్ళల్లోకి చూస్తూ 'ఏమిట్రోయ్. ఆకొర్నర్ తడిపేస్తున్నావు' అన్నాడు. వాడివైపుకు తిరిగి 'సావిత్రిగురించి నీ అభిప్రాయం ఏమిట్రా' అని అడిగాను. అసేసి నాలుక కరచుకుని ఏంలాభం! వాడు నవ్వుతూ లేచాడు. నేను వారించకపోతే ఆచేతుల్తో నాభుజం తట్టేవాడే. 'కొంతమంది యీప్రపంచంలో తమకు తెలీకుండానే కొన్ని ప్రాంగణాల్లో ప్రవేశిస్తుంటార్రా, అలాంటివర్గానికి చెందినదే సావిత్రికూడాను. పాపం, చదువుకు స్వస్తిచెప్పి హాయిగా పెళ్ళిచేసుకుంటే సుఖపడేది...' అన్నాడు విశ్వనాథం నవ్వుతూ వుపన్యాస ధోరణిలో. నాకు

(42-వ పేజీ చూడండి)

ఏకాంక నాటిక:

# స్వతంత్రం

[సమయం:- 1952 వ సంవత్సరం; ఆగష్టు 15 వ తేదీ ఉదయం 8 గంటలు.

రంగం:- విశాలమైన హాలు. మధ్యనున్న వాలుకుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకుంటూ వుంటాడు రామారావు. అతని కొడుకు గోపీ వయసు ప దేళ్లు - హాల్లో ప్రవేశించును ]

గోపీ: నాన్నా! నాన్నా!

రామారావు: (మెల్లగా) ఎందుకురా?

గో: (పరాకుగా) నాన్నా! నాన్నా!

రామ: (చిరాకుగా) ఎందుకురా వెధవా?

గో: ఏం లేదు నాన్నా; వూరికనే... (తల గోక్కుంటాడు).

రా: ఏమీ లేకపోతే ఎందుకు పిలిచేవ్? వూరికనే ఏమిట్రా, వూరికనే! పోయి ఆడుకో.

గో: అది కాదు నాన్నా...

రా: అది కాదూ లేదు, ఇది కాదూ లేదు. పోయి ఆడుకోరా.

గో: ఇవ్వాళ మనకు స్వతంత్రం వచ్చిన రోజటగా? నిజమేనా?

రా: ఓస్! ఇదా నీ అనుమానం! ఔను. మనకి స్వతంత్రం వచ్చి నేటికి ఐదు సంవత్సరాలయింది. ఇవ్వాళే స్వాతంత్ర్యదినం.

గో: అలాగనా!

రా: సరే. ఇక తీరిందా నీ అనుమానం? వెళ్ళు. ఆడుకో. పుస్తకం తెరిచేసరికల్లా వస్తావు; లేనిపోని ప్రశ్నలడగటానికి. (మళ్ళా పుస్తకం చదవడంలో నిమగ్నుడౌతాడు.)

గో: అయితే...

రా: అయితే లేదు. గియితే లేదు. పోయి ఆడుకోరా బాబూ! నీకు కానీ యిచ్చుకుంటాను. (కానీ తీసి యిస్తాడు.)

గో: (కానీ తీసుకొని జేబులో వేసుకుంటూ) స్వతంత్రం అంటే ఏమిటి నాన్నా?

రా: ఏమిటా! నీ తలకాయ. చెబితే నీకేమైనా బోధపడుతుందా, ఏడుస్తుందా? ఎందుకొచ్చిన ప్రశ్నలు!

గో: అబ్బ! చెప్పు నాన్నా. అదే బోధపడుతుంది. నువ్వెప్పుడూ యిలాగే అంటావు. నాకు అర్థమయ్యేటట్టే చెప్పరాదూ!

రా: దచ్చేవ్రా భగవంతుడా! స్వతంత్రం రావడమంటే, ఎవరి దేశాన్ని వాళ్ళు పాలించుకోవడం. ఎవరి బాగోగులు వాళ్లు చూసుకోవడం. ఎవరి యిష్టం వచ్చినట్టు వాళ్లు స్వేచ్ఛగా తిరగడం. అంతే. ఇక వెళ్లి ఆడుకో.

గో: అయితే మనం అంతా స్వతంత్రులం కదూ! నాన్నా!

## శ్రీ నిష్టల బ్రహ్మాజీ

రా: ఔనురా నాయనా! ఔను. ఇకనైనా అవతలకి దయచేస్తావూ! (విసుగుతో తెరచివున్న పుస్తకం ముడిచేస్తాడు.)

గో: ఈ ఒక్క అనుమానం తీర్చేస్తే...

రా: (కోపంతో చేతిలోవున్న పుస్తకాన్ని దభీమని చప్పుడయ్యేటట్టు నేలమీదకు విసిరికొడుతూ) ఛెప్ వెధవా! వెధవ అనుమానాలూ నువ్వూను! ఎందుకొచ్చిన ప్రశ్నలురా ఇవ్వి? ఈ అనుమానాలతో నీ బుర్ర కుళ్ళిపోయింది చివరికి.

గో: అందుకే నాన్నా. నా బుర్ర కుళ్లిపోకుండా అనుమానాలన్నీ తీర్చేసుకుందామనే నీదగ్గర కొచ్చాను.

రా: అయితే ఆ ఏడ్చేదేదో ఏడవరా.

(గోపీ తల్లి కాంతం ప్రవేశించును.)

కాంతం: ఏముండీ! ఏమిటా రాద్ధాంతం?

రామ: ఏముందీ! మన పుత్రరత్నం చేసే అజ్ఞానపు టార్భాటం. వేసే దౌర్భాగ్యపు ప్రశ్నలూను.

కాం: చాల్లెద్దురూ! మీరు మరీను. ఏదో వాడడిగిన దానికి సరియైన సమాధానం చెప్పి పంపించండి.

రా: సరిపోయింది తంటా. నీకూ నీ కొడుక్కీ సమాధానం చెప్పేసరికి నా తల ప్రాణం తోకకి వస్తోంది.

కాం: కాస్త నెమ్మదిగా చెప్పండి. గుండెల్లోదాకా వచ్చి సుష్టంగా వుంటుంది ప్రాణం.

రా: చాల్లే. మాటలు నేర్చావు.

కాం: నేనా? మీరా?

రా: వాడి గోలయింది. ఇక నీగోలా ఏమిటి?

కాం: అవుస్లెండి, వాడూ నేనూ ఏది అడిగినా మీకు గోలగానే వుంటుంది. మేం యిలా యేడ్చినా చూసేవారెవరు?

రా: హరహర మహాదేవా! ఇంక రాగాలు తీస్తావా ఏమిటి?

కాం: ఆఁ. మీరు వూరుకో బెడతారని. ఏడ్చినా మొత్తుకున్నా ఆర్చేవారా? తీర్చేవారా? మా అమ్మా నాన్నా దగ్గర లేరు కదా! (ముఖం అదోలాగ పెట్టుకుని రామారావు కుర్చీకి దగ్గరగా వెళ్లి నుంచుంటుంది.)

రా: ఏం? నేనున్నాను కదూ!

కాం: ఓ! మీరూ వున్నారు. వీధి గుమ్మంలో దీప స్తంభమూ వుంది. (గాజులు గల గలమని చప్పుడు చేస్తూ రామారావు చెంపమీద మృదువుగా చిన్న దెబ్బ వేస్తుంది.)

రామ: (చేత్తో చెంప తడుముకుంటూ) అబ్బ! ఏమిటే మోట సరసం! చనువిస్తే తలమీదికెక్కి నాట్యం చేస్తున్నావే! సర్వస్వతంత్రురాలి వయ్యావా ఏమిటి?

గోపీ: ఇప్పుడిప్పుడే కదు నాన్నా నువ్వు చెప్పావు; మనం అంతా స్వతంత్రులం అని.

రామ: చాల్లేరా! పానకంలో పుడకలా! ఆతల్లికి తగిన కొడుకు వనిపించుకున్నావులే.

కాం: అవును. మీరూ ఆ కొడుక్కి తగ్గ తండ్రి అనిపించుకున్నారు. రారా; నాయనా! పోదాం.

గోపీ: ఉండవే అమ్మా! నాన్న ఈ ఒక్క ప్రశ్నకీ బవాబు చెప్పేస్తే వస్తాను.

కాం: ఆఁ. మీనాన్న అన్నీ చెప్పారులే.

రామ: అవును. వాడంటే నీకు ఒక్కత్తికే ప్రేమ దొర్లిపోతోంది.

కాం: కాకపోతే మరేమిటి! తెలు

స్తూ నేవుంది అభిమానం. నవ్వుకుంటూ పిల్లడు దగ్గరకొస్తే ఏడిపిస్తున్నావు గా! చిన్న పిల్లడిని యెలా లాలించాలో ఆ మాత్రం తెలీదూ! అవున్లెండి. చిన్న పిల్లల సంగతి మీకేం తెలుస్తుంది. (విసురుగా లోపలికి వెళ్లిపోతుంది.)

రామ: (కుర్చీలోంచి కొద్దిగా ముందుకు వంగి) ఓసి నీ నెత్తి మొత్తా! (కొడుకు వైపు తిరిగి) ఏమిట్రా నీ గొడవ?

గోపీ: నాన్నా! నువ్వు స్వతంత్రుడి వేనా?

రాము: ఔనురా నాయనా! ఔను. అందరం స్వతంత్రులమే, తల తల పెద్దలూ దండనాయకులూ తయారవబట్టే దేశం యిలా మండుతోంది.

[కాంతం మళ్ళా హాల్లో ప్రవేశించును.]

కాం: ఆ చెప్పేదేదో కొత్త నెమ్మదిగా చెప్పండి. కస్సుబుస్సు మంటా రెందుకు?

రాము: చిత్తం. రాణీగారి హుకుం! ఏం చేస్తాం. (పెదిమ విరుస్తూ చేతులు త్రిప్పుతాడు కొడుకు వైపుతిరిగి.) నీకు యేం కావాలో అడగరా. నాయనా అనకు. బాబూ అనకు.

గోపీ: నేను స్వతంత్రుడి నేనా?

రాము: ఔనురా! ఔను. ఇకపోయి ఆడుకో.

గోపీ: నిజంగా నేను స్వతంత్రుడి నేనా?

రామ: ఔను. నిజంగా నే. ఇంక నన్ను వేధించుకు తినకు. వెళ్ళు.

గోపీ: నిజం?

రామ: (కోపంతో) ఔనురా పిచ్చి వెధవా! ఔను.

గోపీ: అయితే ఇనప్పెట్టె తాళాలు నాకు అప్పగించెయ్ నాన్నా.

రామ: (కుర్చీలోంచి గుభీమని లేచి నుంచుని) ఎందుకు ??

గోపీ: ఆ వేళ రాత్రి - వర్షం పడిన రోజుని అమ్మతో నువ్వు చెప్పేవు కదూ; గోపీ స్వతంత్రుడయ్యాక ఇనప్పెట్టె తాళాలు వాడికే అప్పగించేస్తాను అని. కావలిస్తే అమ్మనడుగు. (తల్లి వైపు తిరిగి) ఏమమ్మా? నాన్న నీతో చెప్పలేదూ?

రామ: ఆ!!! ఎంత నాటకం ఆడావురా! పిడుగా! (కుర్చీలో కూలబడి పోవును.)

కాం: (ముక్కు మీద వేలు వేసుకొనును)





# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 138. మేఘాలనుంచి ఉరుములు మెరుపులూ ఎలాగు పుట్టుతున్నాయి?

అని పామిడినుంచి కె. బి. నరసింగరావు గారి ప్రశ్న. న్యూకాసిల్ అనే పారిశ్రామిక నగరము ఇంగ్లండులో ఈశాన్యమూల నున్నది. అక్కడ ఒక గొట్టములోనుంచి వచ్చే ఆవిరిలో ఒక చెయ్యి పెట్టి, రెండో చేతిని ఆ గొట్టము మూతికి చేరువగా (ఒక పనివాడు) పెట్టినప్పుడు చేతికీ గొట్టానికీ నడుమ మెరుపులు వచ్చాయట. ఇది సాధ్యమే. ఆవిరి కణములు రాపిడివల్ల విద్యుత్పూరితాలయాయి. ఈ ఆవిరిలో చెయ్యి పెట్టడమువల్ల విద్యుత్పూరితకణాల విద్యుదావేశము చేతికీ పనివాడి వంటికీ అందింది. రెండో చెయ్యిని గొట్టాము కొస దగ్గరకి చాచినప్పుడు వంటబట్టిన విద్యుత్తు చాచిన వ్రేళ్లకొసని పోగై, ఒత్తిడి ఎక్కువై, గొట్టానికి మెరుపుగా గెంతింది.

ఆకాశంలోని మెరుపులలో జరిగేది సరిగ్గా ఇలాంటిదే. అయితే అది భారీవ్యవహారమూ. సముద్రాలూ, నదులూ, చెరువులూ - వంటి జలాశయాల నీరు సూర్యుని వేడికి ఆవిరై తేలిక పడడమువల్ల గాలిలో పైకి పోతూ, రాపిడికి విద్యుత్పూరిత మౌతుంది. ఇలాగ ఒక మబ్బులాగ ఏర్పడిన ఆవిరిలో విద్యుదావేశము పెరిగి, భూమి యొక్క విద్యుత్తులో తనకి వ్యతిరేకమైన విద్యుత్తుని మేడల కొసలకీ, చెట్లకొసలకీ ఆకర్షిస్తుంది. ఈ రెండురకాల విద్యుత్తుల 'ఒత్తిడి' ఎక్కువైతే ఒక్క గంతులో ఇవి రెండూ కలిసి చెల్లిపోతాయి. రెండురకాల విద్యుత్తులూ అప్పూ ఆస్తీ వంటివి. రెండూ చేరితే రెంటిస్వరూపమూ మాయమౌతుంది. ఇలాగ ధన, ఋణ విద్యుత్తులు చేరడమే మెరుపు అంటే. మెరుపుకి కారణము మేఘాలలోని ద్రవ్యమనడము సరికాదు, విద్యుదావేశమనాలి. ఇక ఉరుమా? ఉరుము 'కరకర' మనే చణుకూ, దానితో బడబడమని బయల్దేరే శబ్దమూ, రెండూ చేరినది. కరకర మన్నది విద్యుత్తు మేఘమునుంచి నేలకి గెంతే మెరుపు గాలికణాల్ని ఛేదించడమువల్ల గాలిలో పుట్టే శబ్దము. ఈ చెణుకు పొడూగునా పుట్టే శబ్దము తక్కిన మబ్బులనుంచి పరావర్తమై కొంతసేపు పాటు మనకి వినబడితే, దానినే 'ఉరుము' అంటాము. మెరుపును మెరుపులూ ముటు' అంటాము. మెరుపును ములుకోలా, పిడుగును చీలా అనడము తెలియని రోజులలో తెలియని 'పెద్దలు' తెలివితక్కువ. తెలియనిదానికి ఏదో దేవత సంబంధము కల్పించడము అజ్ఞానపుజాతులన్నిటిలోనూ కనబడుతుంది. సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ, గ్రహాల్నీ దేవతలన్నారు పూర్వులు. అవన్నీ చైతన్యములేని గోళాలు. దూరదర్శినితో చూస్తే సూర్యగోళములో లేచే కాంతి వాయువులూ, మంటలూ, చంద్రగోళములోని కొండలూ వాటి నీడలూ కనబడతాయి. మరి దేవత లనగా ఏమిటో? అలాంటివే ఉరుము మెరుముల వివరణాలూనూ.

పిడుగును నిర్వీర్యము చేయడానికి తాలూకాఫీసులవంటి భవనాల శిఖరాలమీద నిలిపే రాగి 'చెయ్యి', మబ్బులోని విద్యుత్తుని లాగేసి భవనాన్ని సురక్షితము చేస్తుందే దీనికి ఏమని పేరుపెట్టాలి? ఇంద్రుడి వజ్రానికి ప్రతి! 'గరుత్మంతుని ఈక' అనా?



## 139. ద్వీపముల వలయాకారము

'అట్లాసులో చూస్తే ప్రపంచంలో వున్న చిన్నచిన్న ద్వీపాలు అన్నీ వలయములోని ఒక భాగముమాదిరిగా ఉన్నవి. దీనికి కారణము ఏమిటి?' అని మద్రాసునుంచే సి. యి. సెప్రహూగారు అడుగుతున్నారు.

పెద్దదీవులలో ఆస్ట్రేలియా, గ్రీన్లండూ, బోర్నియో, గుండ్రంగా లేవుగాని కొంత తీరరేఖ వలయాకారముగా కనబడుతుంది. చిన్నదీవులు, మడగాస్కర్, న్యూగినీ, బోర్నియో, జపాన్ దీవులూ, ఆర్కిటిక్ ద్వీపమంజరీ, న్యూజిలాండూ, ఇంగ్లండూ వంటివి గుండ్రంగా ఉన్నాయనలేము. దీవుల ఆకారమును గురించి ఆలోచించేముందు ఈ దీవులు ఎలాగు ఏర్పడి ఉంటాయి? అని ఆలోచించాలి.

భూమి వాయు రూపమునుంచి ద్రవరూపమూ, తర్వాత ఘనరూపమూ పొంది చల్లారినప్పుడు గాని నీరు భూమిమీద ఏర్పడదు. నీరు ఏర్పడినప్పుడు సముద్రమంతా ఒకే లోతు గలిగిఉండి ఉంటుంది. తర్వాత భూగర్భములోని శిలాద్రవాల కదలికవల్ల వచ్చే భూకంపాలవల్ల కొంత నేల లేచిపోయి, మరికొంత దిగిపోయి భూమిమీద ఎగుడుదిగుడులు ఏర్పడిఉంటాయని శాస్త్రజ్ఞుల నమ్మకం. పసిఫిక్ మహాసముద్రము అన్ని సముద్రాలకంటే లోతైనది. ఇది, భూమి ద్రవరూపమునుండి ఘనరూపానికి వస్తూఉండగా సూర్యుని ఆకర్షణశక్తివల్ల 'ఉప్పొ'పడిన భూద్రవ్యము చివరకి బిందువులాగ (చంద్రుడై) విడిపోయి లోయ ఏర్పరిస్తే ఆ లోయ చల్లారి చల్లారి, నీరు నింపుకుని తయారయిన సముద్రమని వైజ్ఞానికుల నమ్మకము. అందుకే పసిఫిక్ సముద్రతీరము గుండ్రముగా ఉండడమూ, పసిఫిక్ సము

ద్రపు టడుగు అన్ని సముద్రాల అడుగు లాగ శేనపురాతి నిర్మాణము కాక 'బసాల్ట్' అనే కఠినశిలానిర్మాణముగా కన పడుతున్నదనీ చెప్తారు. భూమి పై పొర లలో శేనపురాళ్ళూ, లోతైన పొరలలో నే బసాల్టు శిలలూ కనబడతాయి. అన్ని సము ద్రాల అడుగూ శేనపురాతి నిర్మాణమే. పసిఫిక్ సముద్రపుటడుగులో శేనపురాళ్ళు లేవు. ఈ శేనపురాతి 'పొర' చంద్రుడిలోకి చేరిపోయిందంటున్నారు శాస్త్రజ్ఞులు. పసి ఫిక్ తీరమంతా - ఇటు ఆసియా తూర్పు తీరమూ, అటు అమెరికాల పశ్చిమతీరమూ పర్వతమయము.

హిమాలయాలూ, రాకీ పర్వతాలూ ఏర్ప డటానికి భూమియొక్క పైపొరలు అడుగు పొరలమీద జరగడమే కారణ మంటు న్నాడు వెజినర్. బట్టను జరిపితే పడే ముడ తలలాగ హిమాలయాలూ, ఆల్ప్స పర్వ తాలూ, రాకీ పర్వతాలు ఏర్పడ్డా యంటాడు. ఇది కేవలము ఊహాచిత్రము కాదని, మన దేశములో కటకపురివద్ద 'తాల్చెర్'లో కనపడ్డ ప్రభూతకాలపు మంచు చిహ్నలూ, హిమాలయాలమీద 7000 అడుగుల ఎత్తున దొరికిన చేపలఫాజలు చిహ్నలూ సాక్ష్యము ఇస్తున్నాయి. ఇలాగ ఇండియా ఉత్తరానికి జరగడములో, పర్వతసీముల బరువువల్ల కలిసిరాక, సగము ప్రయాణములో తెగిపోయి నిల్చిపోయిన భూభాగాలే లంక, మెడగాస్కర్ వంటి దీవులట. భూమి చీలిపోయి జరిగిపోవడము వల్లనే అమెరికాల తూర్పు తీరమూ, యూరప్, ఆఫ్రికాల పశ్చిమతీరమూ ఒక దానిలో ఒకటి పట్టేటట్లున్నాయట. న్యూజిలాండు ద్వీపాలు విరిగిన ద్వీపపు రెండు ముక్కల లాగుంటాయి. బ్రిటిషు సొమాలీలాండూ అరేబియా దక్షిణపుటంచూ కలిసి ఉండినట్లూ, గ్రీన్లండూ, ఆర్కిటిక్ ద్వీపాలూ ఉత్తర అమెరికాతో కలిసివుండి నట్లూ గోచరిస్తాయి.

ద్వీపాల ఆకారానికి ఇన్ని కారణాలు కనబడుతున్నాయి. కనక గుండ్రంగా వుంటాయని బారుగా నిశ్చయించలేము. మనకి నేడు గోచరించే గుండ్రన యుగాల తరబడిని సముద్ర తరంగాల తాకిడివల్ల ఏర్పడి ఉంటుందన్నా పొరపాటు కాదేమో. ★

## చిట్టి ప్రశ్నల జవాబులు

—వస్తువులు పారదర్శకములూ నపార దర్శకములూ అని రెండు విధాలు. గాజూ నీరూ వంటివి వెల్తురును తమలోనుంచి పోనిస్తాయి. ఇవి పారదర్శకములు. అట్టా, కర్రా వెల్తుర్ని తమలోనుంచి పోనివ్వవు. ఇవి నపారదర్శకములు. మన చర్మమూ నెత్తురూ సగం సగము పారదర్శకములే. కనక బ్యాటరీలైటు వెలిగించి దానిమీద చెయ్యి పెట్టినప్పుడు వెల్తురు నెత్తురులో నుండి చొచ్చుకుని రావడంలో కొంత మాత్రమే రాగలిగి, ఆ కొంతయైనా చెదిరి చెదిరి రావడంవల్ల యెముకలనీడ సరిగ్గా కన పడక చేయి ఎర్రగా కనబడుతుంది.

—అవును. రైలుపెట్టెలో ఎగిరే కీటక మునకు రైలుగట్టుమీదనుండి గుర్తించినచో రైలుకంటె ఎక్కువ వేగమే వున్నట్లు తెలుస్తుంది. రైలులో కూర్చున్నవారికి మాత్రం కీటకముయొక్క వేగములోనుండి రైలువేగమును తీసివేసినప్పుడు మిగిలే వేగము మాత్రమే కీటకమునకు వున్నట్లు కన బడుతుంది. కీటకము రైలు లోకప్పుమీద వాలినప్పుడు రైలు తన వేగముతోనే దానిని తీసుకుపోతుంది కదా! ఇప్పుడు కీటకము ఎగిరిన దనుకుంటే, గట్టుమీదనుంచి చూసే వారికి దాని వేగము రైలు వేగముకన్న ఎక్కువగా కనబడడములో విచిత్రమేమిటి? కీటకమునకు ఈ వేగము అలవడుటకు అది ఒక్కమారైనా రైలుపెట్టెమీద వాలడం అవసరం.

—భూమిమీద చేసిన ప్రయోగముల వల్లా, భూమిమీది సాధనములవల్లా, భూమి సూర్యునిచుట్టూ తిరగడానికి కదుల్తున్నట్లు నిరూపించ వీలులేదు. కాని ఒక ఏడాది పొడూగునీ నక్షత్రాల స్థావరాన్ని పరిశీ లిస్తే నక్షత్రాలన్నీ అతిచిన్న వర్తులాలలో తిరుగుతున్నట్లు కనపడతాయి. ఒక నక్ష త్రము కాదు నక్షత్రాలన్నీనూ! ఈ సంగ తిని సర్దిచెప్పడానికి భూమైనా సూర్యుని చుట్టూ తిరుగుతుందనాలి, ఆ నక్షత్రాలైనా చిన్న వర్తులాల్లో తిరుగుతున్నాయనాలి. ఒక్క భూమికి గమనం వున్న దనుకుంటే పైన చెప్పిన గమనాలన్నీ వాస్తవమైన గమనాలు కావని తేలుతుంది. "తక్కిన గ్రహాలన్నీ సూర్యుని చుట్టూ తిరుగుతున్న ట్టుగా దృష్టాంతా లున్నప్పుడు భూమి మాత్రం ఎందుకు తిరుగుతున్న దనుకో కూడదూ" అని శాస్త్రజ్ఞులు ఆలోచించి భూమే సూర్యునిచుట్టూ తిరుగుతున్నది అనే నిర్ధారణకు వచ్చారు.

—నూతిలో గాని చెరువులో గాని చని పోయిన మనిషియొక్క శరీరము నానిపోయి ఉబ్బిపోవును. ఆ మనిషి శరీరముయొక్క బరువు మాత్రము నీటిలో నున్నంతవరకూ మారదు. అదే బరువుకు పరిమాణము హెచ్చు గుటవల్ల ఆ శరీరపు సాంద్రత తగ్గును. అందు వలన ఆ శరీరము తేలిపోవును. చనిపో తూన్న మనిషిని గాని జంతువును గాని కాటామీద పెట్టి తూచి చూచినచో చని పోవుటవల్ల ఒక జీవి బరు వెక్కువనే ఊహ వట్టి అపోహయే అని తేలును.

—మేఘాలకు వర్ణము వుండుటకు కార ణము ఆ మేఘాలనుండి మనకు చేరే వెల్తు రుకు రంగు వుండడమే. సూర్యుని వెల్తురు మేఘముపై పడినప్పుడు, మేఘముయొక్క ముఖమువద్దనుంచే పరావర్తమై మనకు వచ్చే వెల్తురు సూర్యునివెల్తురువంటిదే కనక సామా న్యముగా మేఘములు తెల్లగా కనబడును. మేఘముయొక్క ముఖమునుండి కాక పృష్ఠ భాగమునుండి పరావర్తమై మనకు చేరే తెల్లని రశ్మి మేఘములోనుండి చొచ్చుకుని బైటికి వచ్చునప్పుడు ఆ మేఘములోనుండు సూక్ష్మమైన దుమ్ము కణములూ బొగ్గు కణ ములూ చేరి తెల్లని వెల్తురులోని రంగుల నన్నిటినీ విరజిమ్మివేసి ఎరుపునీ నారింజ రంగునీ మాత్రము వదలుటవల్ల ఆ రంగుల వెల్తురే మనకంటికి చేరి ఆ మేఘములు ఎర్రగా గాని నారింజరంగుగా గాని కన పడును.

—వీసిరే గాలులు, భూమిపై ఒక ప్రదే శమునకునూ యింకొక ప్రదేశమునకునూ గల ఉష్ణతాభేదమువలన కలుగుచున్నవి. ఎండ వేడికి నేల వేడెక్కి దానిమీది గాలికూడా వేడెక్కి పలచనైపోవడంవల్ల, చల్లగానూ దట్టముగానూ వున్న సముద్రముమీది గాలి భూమిమీది గాలియొక్క పలచదనమును భర్తీ చేయడానికి భూమిమీదికి వీసురుతుంది. భూమిమీద వీసిరే గాలులన్నిటికీ యిలాంటి కారణాలే చెప్పుకోవచ్చు. ★

రాముా తండ్రి: నేనెన్నో సారులు చెప్పా వాడికి - చరిత్ర బాగా చదివి ఏడవరా - అని. వాడు నా మాట వింటేనా. వాడు అందులోనే తప్పాడు. వెధవ...

రాముా తల్లి: మీరుకూడా అలాగ అంటారేమిటండీ! ఆ పేపరిచ్చిన వాడెవడో గాని మన అబ్బాయి పుట్టకముందు జరిగినదంతా అడిగేడట. పాపం వాడికి మాత్రం ఏమి తెలుస్తుంది? చెప్పండి?



"భవిష్యత్తు నాదే'

ఫొటో: శ్రీ ఆర్. పి. రంగారావు, సికింద్రాబాదు.

అవనియంతా పెద్ద అక్షయపాత్ర !
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ !

... ... ...

అన్నమో అమృతమో ఆకొన్న పేదకో
కన్నతల్లీ! బ్రతుకునిండ భిక్షాందేహి !

(కృష్ణశాస్త్రి)

ఫొటో: శ్రీ పి సి ఎమ్ ఈశ్వరబాబు—మద్రాసు



# -ఎత్తుకుపై యెత్తు-



రచన: శ్రీమతి ద్రోణాదుల సరోజినీదేవి

పండుగరోజని
వేడుకకోసం
అత్తారింటికి
అల్లుడుపోతూ
తోడుగ మిత్రుని
తీసుకు వెళ్ళెను.

పిసినిగొట్లు
ఆ అత్తా మామలు
వచ్చిన మిత్రుని
పంపుట యెట్లని
"గుస గుస" లెన్నో
చేశారు
గుట్టుగ యెత్తొక
టేశారు.

పీటలువేసి
ఆకులువేసి
సన్నని బియ్యపు
తెల్లని అన్నం
గారెలు బూరెలు
బజ్జీబోండా
మెరుగూ మెరుగు
ఒక విస్తరిలో
మస్తుగ బెట్టారు.

సంకటి ముద్ద
కారపుముద్ద
రెండవ విస్తరి
నందుంచారు.

వడ్డనఅంతా
చూచిన మిత్రుడు
అల్లునికంటె
ముందుగ లేచి
కాలూ చేయీ
కడిగి మెల్లగా
మొదటి విస్తరికి
ముందుకు చేరెను.

అల్లుడుకూడా
తప్పని సరిగా
రెండవపీటను
చేరాడు.

గుండెలు జారిన
అత్తామామలు
"ఇక్కడ కాదు
మీరక్కడ నేనని"
మిత్రుని చూచి
చెప్పారు.

"ఇక్కడఅయినా
మరెక్కడ అయినా
ఒకటే" నంటూ
విస్తరిపట్టుక
మిత్రుడు వెంటనె
లేచాడు.

అత్తామామలు
బొమ్మల్లాగ
బిక్కచచ్చి
నిల్చున్నారప్పుడు.



బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

### 10

పడవలో వుండేవాడికీ, పడవతాడు లాగేవాడికీ మధ్య సానుభూతి అనేది కొరతబడినప్పుడు ఎటువంటి పరిస్థితి ఎదురయ్యేదీ నేనూ జార్జి యిదివరకు ఒకసారి 'వాల్టన్' వద్ద స్వయంగా చూశాం. అక్కడ పడవలాగేవాళ్ల కాలిబాట నెమ్మది నెమ్మదిగా నీటిమట్టానికి దగ్గిరకి జరిగి జరిగి, కొంతమేర అసలు నీటిలోనే మునిగిపోయి వుంటుంది. నేనూ జార్జి అవతల గట్టుమీద కూర్చొని చుట్టుపట్ల జరిగేవన్నీ చూస్తున్నాం. అలా కొద్దిక్షణాలు గడిచేసరికి నీటిమీద చిన్నబోటు ఒకటి మహా వేగంగా రావటం కనిపించింది. ఆపడవకి అంత వేగం ఎలా వచ్చిందా అని పరీక్షగా చూశాం. చూస్తే—ఆపడవని లాగుతున్నది మామూలు మనిషి కాదు: మంచి బలమైన గుర్రం! ఆగుర్రం మీద ఒక చిన్నకుర్రాడు కూర్చొని వున్నాడు. బోటులో అడ్డదిడ్డంగా ఎవరో ఐదుగురు మనుష్యులు నిద్రమత్తుగా పడివున్నారు. అందరిలోకీ చుక్కాని పట్టుకొన్నవాడు మరీ నిద్రమత్తుగా వున్నాడు.

"అటుచూడు! ఆపడవతాడు వున్నదే—అది గనక యిప్పుడు యింకేదైనా పడవతాడుతో పెనవేసుకు పోయిందంటే బలే మజాగా వుంటుంది లే!" అన్నాడు వుబుసుపోని మాజార్జి. సరిగ్గా వాడు ఆమాట అన్న సమయానికే అంతపనీ జరిగి పూరుకొంది. దాంతో ఆపడవ పెద్దచప్పుడు చేసుకొంటూ గట్టు ఎక్కేసింది. నలభై వేల తానులు ఒక్కసారిగా చింపితే ఎటువంటి చప్పుడు అవుతుందో అటువంటి చప్పుడు అయింది. ఆకుదుపుకి పడవలోనుంచి యిద్దరు మనుష్యులు, ఒక పెద్దగోనెసంచీ మూడు తెడ్లు విసిరేసినట్లు యివతలకి వచ్చిపడ్డాయి. ఒకటిన్నర సెకండు కాలం గడిచేలోగా మరో యిద్దరు మనుష్యులు పడవకి అటు వైపునుంచీ దొర్లుకొంటూపోయి పగిలిపోయిన సీసాల మధ్యా, చెల్లాచెదురైన చేతిసంచుల మధ్యా కుప్పన కూలబడిపోయారు. అందరిలోకీ చివరివాడు యింకో యిరవై గజాలదూరం గాలిలో కొట్టుకుపోయి, అక్కడ నేలని తలతో తాకి అట్టేవుండిపోయాడు.

పడవలోని సరకుఅంతా యీ విధంగా తగ్గిపోవటంచేత, పడవ తేలికై నేలమీద యింకా వడిగా కదలిపోతోంది. అవతల గుర్రంమీద కూర్చున్న కుర్రాడు యిదేమీ గమనించకుండా, వాడి వుషారు కొద్దీ గుర్రాన్ని అదిలించి గాలప్ చేయించాడు. ఇవతల యీ ఐదుగురూ కొంతసేపటికి తెప్పరిల్లి, కల మధ్యలో మేల్కొన్న మనుష్యుల్లాగా, ఏం జరిగిందీ బోధపడక ఒకళ్లవంక ఒకళ్లు కళ్లు అప్పగించి చూసుకొంటున్నారు. అసలుజరిగిన సంగతేమిటో వాళ్లకి

---

మూలం :
జెరోమ్ కె. జెరోమ్



అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

బోధపడటానికి బాగా ఐదారు నిమిషాలు పట్టింది. అది తెలిసిరావటంతోటే అందరూ కంగారుగా బోటు కోసం కేకలు పెట్టటం మొదలుపెట్టారు. గుర్రంమీద కూర్చున్న కుర్రాడిని ఆగమని గొంతులు చించుకు అరుస్తూ వాడివెనక పరుగెత్త నారంభించారు. వీళ్లు ఎంత అరిస్తేనేం, ఆగుర్రంమీద కూర్చున్న కుర్రాడు వాడిఆటల్లో వాడు పడి వీళ్ల అరుపులు ఎంతకీ విని పించుకోలేదు. నేనూ జార్జి, వాళ్లంతా కనుచూపు మేరదాటి పోయేదాకా ఆవినోదం చూస్తూ అలానే వుండిపోయాం.

వాళ్లకి అల్లాంటి దురవస్థపట్టినందుకు నాకు ఎంత మాత్రం విచారంలేదు. లేకపోగా— వీళ్లలాగా పడవలకి గుర్రాలనుకట్టి, ఆగుర్రాలని తోలేపని చంటి కుర్రాళ్లకి అప్పగించే వాళ్లకందరికీ (అల్లాంటి వారు చాలామందే వుంటారు) యీశాస్తి జరగాల్సిందేనని మనస్ఫూర్తిగా కోరుకొంటున్నాను. ఏమంటే—యిలాంటి తెలివితక్కువ పనిచేసినందువల్ల అపాయం వాళ్లకి ఒక్కళ్లకేకాదు; నదిలో ప్రయాణం చేసే పడవలన్నిటికీ ఏ ప్రమాదంజరిగినా జరగవచ్చు. వాళ్లపడవతాడు వచ్చి, ఏపాపమూ ఎరుగని మీపడవ తెరచాపకొయ్యని చుట్టేసి, మీబోటునే తలకిందులు చేసి పారవేయవచ్చు. అల్లాంటప్పుడల్లా మనం ఒక్కటే పనిచేయవలసి వుంటుంది: మనబోటువున్న చోటనే వుంచి, తెరచాప కొయ్యచివరి భాగంతో వాళ్లపడవనీ ఆపడవతాడునీ దూరంగా తోసెయ్యటమే!

వీటి మాటకేంగాని — పడవతాడు లాగేపని పడతుల పాలపడినప్పుడు పడవల్లోవుండే వారి అనుభూతి బలే చమత్కారంగా వుంటుంది. ఎంత చమత్కారంగా వుంటుందంటే—జీవితంలో ప్రతి ఒక్కరు ఒక్కసారైనా ఆ అనుభవాన్ని పొందితీరాలని పిస్తుంది. మీరు ఎప్పుడైనా చూడండి — పడవతాడు లాగే ఆడపిల్లల సంఖ్య మూడుగా వుంటుంది. ఇద్దరు తాడు పట్టుకు గుంజుతూవుంటే, మూడోపడుచు మాటి మాటికీ వాళ్లచుట్టూ తిరుగుతూ పగలబడి నవ్వుతూ వుంటుంది. వీళ్ల నవ్వులాట సామాన్యంగా వాళ్లనివాళ్లే ఆతాడుతో కట్టేసుకోవటంతో ఆరంభమౌతుంది. అంతటితో పడవలాగటం మానేసి ముగ్గురూ నేలమీద కూలబడిపోయి, పగలబడి నవ్వుతూ ఒకళ్ల కాళ్లకి చుట్టుకుపోయిన తాడుని రెండోవాళ్లు విప్పటానికి ప్రయత్నిస్తారు. ఆ విప్పుకోవటం ఎంత తీరుగా వుంటుందంటే, కాళ్లకివద్ద బందాలన్నీ సాంతం విప్పేసరికి ఆతాడే వాళ్లమెడలకి వుచ్చులా తగులుకుపోయి వుంటుంది. వుచ్చులు వూడదీసుకోబోయి మరింత బిగించుకొంటారు. ముగ్గురికీ గుడ్లు వెళ్లుకొచ్చినంత పని అవుతుంది. నానా తంటాలుపడి అన్యాయపుచావు తప్పించుకు బయటపడతారు. ఆతాడుని పట్టుకు సాగదీసి పడవనిపట్టుకు యీడ్చివెయ్యటం మొదలు పెట్టుతారు. కాస్సేపు భూమిమీద కాలు ఆనకుండా పరుగులు తీస్తారు. ఇంత ఆర్భాటంగానూ బయలుదేరి, తీరా వందగజాలైనా పోకముందే ముగ్గురూ అలిసిపోయి, వెకిలినవ్వులు నవ్వుకొంటూ గడిమీద కూలబడి పోతారు. వాళ్ల ఆనవ్వుల సందడిలో పడవకాస్తా నది నట్టనడానికి కొట్టుకుపోయి అక్కడ గిరుక్కున వెనక్కి తిరుగుతుంది. పడవలోవున్న మీబోటివాడు ఏం చెయ్యటానికీ తోచక తికమక పడుతుంటే, వాళ్లు అప్పటికి తెలివితెచ్చుకొని, మళ్లీ యికయికలు పకపకలు ప్రారంభిస్తారు.

"చూడవే! ఆపెద్దమనిషి పడవతో సహా నది నట్టనడానికి ఎల్లాపోయాడో" అంటూ ముగ్గురూ ఎక్కడలేని ఆశ్చర్యాన్నీ వెలిబుచ్చుతారు. ముగ్గురూ కలిసి మళ్లీ పడవతాడు పట్టుకు ఒక గుంజు గుంజుతూ వుండగా, వాళ్లలో ఒక వయ్యారిభామకి గౌనుపిన్ను సరిచూసుకోవలసిన అవసరం అర్జంటుగా కలుగుతుంది. ఆ పనికోసం మిగిలిన యిద్దరు కూడా పట్టువదిలేస్తారు. దాంతో పడవ ఒకమూలకి తోసుకుపోయి గట్టు ఎక్కేస్తుంది.

ఇంక యిలా వాళ్లని నమ్ముకొంటే లాభం లేదని, పడవలోని పెద్దమనిషి తానే ఒడ్డుమీదికి దూకేసి, తనబలాన్నీ అంతటినీ ప్రయోగించి పడవని నీళ్లలోకి నెట్టేసి, తాను గబగబా పోయి అందులో ఎక్కి కూర్చుంటాడు. ఇకనైనా వెర్రివేషాలు మానేసి

ఎక్కడా ఆగకుండా పడవ లాగమని ఒక్క కేక పెట్టుతాడు.

ఈయన అంటున్నదేమిటో సరిగా వినిపించకుండా, వాళ్లు అక్కణ్నుంచే "ఏమిటి కావాలిమీకు?" అని కేకేస్తారు.

"ఆగకుండా పొండి?"

"ఎక్కడికి పొమ్మంటున్నారు?"

"వల్లకాట్లోకి! ఎక్కడా ఆగకుండా పొమ్మంటున్నాను." అని ఆ పడవలో మనిషి గొంతు చించుకు అరుస్తాడు. అప్పటికీ వాళ్లకా మాట సరిగా వినపడదో, వినపడినా బోధపడదో—

"ఒసే! ఏమిటీ! ఆయన ఏమిటో అంటున్నట్లున్నాడే. కాస్త వెనక్కి వెళ్లి ఆయన గోలఏమిటో కనుక్కు రద్దూ!" అంటుంది వాళ్లల్లో ఒక పడుచు. రెండోది వెనక్కి వచ్చి "ఏం జరిగిందీ? ఏం కావాలి మీకు?" అని ఏమీ ఎరగనట్టు అడుగుతుంది.

"ఆ! ఏమీ అక్కరలేదు. మీరు ఎక్కడా ఆగకుండా పోతే అంతేచాలు."

"ఏం? ఎందుకు ఆగకూడదు?"

"ఎందుకేమిటి? దిబ్బలు! మీరా వరసని అడుగు అడుగుకీ ఆగుతూవుంటే యిక్కడ చుక్కాని పట్టలేక ఛస్తున్నాను. కాస్త పడవవిషయం కూడా జ్ఞాపకం బెట్టుకొని ముందుకి నడవండి."

"ఏమిటీ పెట్టుకోమంటున్నారు?"

"పడవసంగతి — జ్ఞాపకం పెట్టుకోమంటున్నాను."

"ఓ! దానికేం — నిక్షేపంలా జ్ఞాపకం పెట్టుకొంటాం. ఆమాట మిగిలినవాళ్లిద్దరికీ కూడా చెప్తాను. అన్నట్లు—మేం పడవ తాడు లాగుతున్నందువల్ల మీకేమీ యిబ్బందిగా లేదుగదా?"

"ఎబ్బే! ఏమీలేదు. అందులోనూ మీరు పడవలాగటం మహా పసందుగా వుంది. కాకపోతే ఎక్కడా ఆగకుండా ముందుకిపోతే యింకా బాగుంటుంది. పోయిరా!"

"మంచిది. చూడండి. పడవ అడుగుభాగాన నాశాలువ వున్నది: కాస్త తీసి యిటు పడేస్తారూ?"

ఆపెద్దమనిషి నడుములు పడిపోయేటట్లు పడవలోకి వొంగి అక్కడవున్న సరుకులు అన్నీ గాలించి ఆశాలువని వెతికి పైకితీసి ఆవిడచేతికి అందించేలోగా, రెండోపిల్ల వస్తుంది—తనకీ తన శాలువతో అవసరం వచ్చిందని. మూడోపిల్లకి కూడా శాలువ అవసరం అవుతుందేమోనని దాన్నికూడా పట్టుకెళ్తారు కానీ, ఆపిల్ల తనకిప్పుడు అక్కరలేదంటుంది. ఆశాలువని వెనక్కితెచ్చి యిచ్చేసి, ఆ మూడోపిల్ల తాలూకు దువ్వెన ఎక్కడోవుందని చెప్పి, అది కొంచెం వెతికి తమ చేతికి యిమ్మంటారు. ఈ తతంగమంతా పూర్తి అయ్యేసరికి యిరవైనిమిషాలు పట్టుతుంది. మళ్లా పడవ కదిలి మలుపు తిరిగేలోగా అక్కడ వాళ్లదారికి అడ్డంగా ఒకఆవు పడుకొని వుంటుంది. దాన్ని అదిలించి బెదిరించి లేవగొట్టటానికి ముగ్గురూ పడవతాడు వదిలేస్తారు.

ఈ విధంగా పడవలాగే పని పడతులకి అప్పగించినప్పుడు ఎదురయ్యే బాధలకి అంతం అంటూ ఎన్నటికీ వుండదు.

మళ్లీ మాసంగతికి వద్దాం. ఆజార్జిగాడు నానా తంటాలూపడి కొంతసేపటికి మాపడవతాడుని సరిచేసి 'పెంటన్‌హుక్' దాకా ఏగొడవా లేకుండా పడవని యీడ్చుకెళ్లాడు. అక్కడికి చేరేసరికి పడకలు ఆరుబయట వెయ్యటమా, పడవలోనే ఒకమూల ముడుచుకు పడుకోవటమా అనే సమస్య చర్చకు వచ్చింది. చివరి కెలాగైతేనేం ఆరాత్రికి పడవమీద పడుకోందామనే నిశ్చయానికే వచ్చాం. కాని ఒక చిక్కు వచ్చింది. పెంటన్ హుక్ దగ్గరే మజిలీ వేద్దామా అంటే అప్పటికి యింకా పొద్దు కూకటానికి చాలా ఆలస్యంవుంది. కాబట్టి అప్పుడే పక్కలుపరిస్తే చూసేవాళ్లకి బాగుండదు. 'స్టెయిన్స్' దాటి మూడున్నరమైళ్ల దూరంలోవున్న 'రన్నిమిడ్' దాకా ఆబిగిని పోదామనే నిర్ణయానికి వచ్చాం. అక్కడ చెట్లూ అవి దట్టంగా పెరిగి చూడ ముచ్చటగా వుంటుంది. అటువంటిచోట ముడుచుకుపడుకొన్నా ప్రాణానికి హాయిగా వుంటుంది.

అప్పటికేమిటో అలా అనుకొన్నాం కాని, మొదట అనుకొన్నట్లు 'ఆపెన్‌టన్ హుక్' దగ్గరే ఆగిపోయినా బాగుండేదని ఆతరువాత అనిపించింది. పొద్దుటింతలైతే ఏటికి ఎదురుగా మూడు నాలుగుమైళ్లు వెళ్లవలసి వచ్చినా అట్టే కష్టమనిపించదు. అదే

# ★ ముచ్చటగా ముగ్గురం ★

పగలంతా పడవ లాగి లాగి వున్న మీదట పొద్దుకూక బోయేవేళకి ఏటికి ఎదురు వెళ్లమంటే ఎవడికైనా చచ్చినచావు అవుతుంది. చుట్టూవుండే ప్రకృతి దృశ్యం ఎంత మనోరంజకంగావున్నా, మనస్సు దాని మీదికిపోదు. పడవ అరమైలు దూరం ప్రయాణంచేసే సరికి, మైలుదూరం ప్రయాణం చేసినంత హైరానా అవుతుంది. అటువంటి పరిస్థితుల్లో ఎంత వాగుడు కాయకీ కూడా మాట్లాడటానికి ఓపికలేకుండా పోతుంది. నవ్వు అనేది అసలు ఎంతప్రయత్నంచేసినా పెదిమలమీదికి రాదు. ఎప్పటికప్పుడు మీపడవ ఫలానిచోటికి వచ్చిందని మీకు మీరే నమ్మలేకపోతారు. మాటి మాటికీ మ్యాపుతీసి చూస్తుంటారు ఒకదశకు వచ్చేసరికి యీమ్యాపు అంతా తప్పులతడిక అనిపిస్తుంది. మీ మానానికి మీకు పదిమైళ్లు ప్రయాణంచేసినట్లు అనిపిస్తుంది కానీ, పదిమైళ్లలోపుగా తగలవలసిన లాకు ఎంతకీ తగలక పోయేసరికి, ఎవడో దగాకోరు యిటీవలి కాలంలో అక్కడవున్న లాకుని వూడపీకి పట్టుకుపోయి వుంటాడని పిస్తుంది.

ఇదివరకు ఒకసారి పడవప్రయాణంలో యిలాగే క్రిందుమీదు అయ్యాను. ఇప్పుడీ సందర్భంవచ్చింది కనుక ఆకథ యిక్కడకొంచెం చెప్తాను. ఆరోజున నేనూ, మాతల్లి తరఫున చుట్టం ఒకపడుచుపిల్ల 'గోరింగ్' వైపుకి పడవలో వస్తున్నాం. అప్పటికే పొద్దు కుంకిందేమో చప్పున ఆవూరుచేరి పోవాలని తొందర పడుతున్నాం. నామాట ఎల్లావున్నా, ఆ అమ్మాయి మాత్రం తహతహలాడి పోతున్నది. 'బెన్‌సన్ లాక్' దగ్గరికి మాపడవ వచ్చేసరికే సాయంకాలం ఆరున్నర అయింది. అప్పటికే కప్పెడు కప్పెడు చీకటిపడుతున్నది. అవతలచీకటి పడుతున్నకొద్దీ యివతల యీావిడగారి గుండెదడకూడా ఎక్కువ కాసాగింది. భోజనాల వేళకైనా 'గోరింగ్' చేరి పోకపోతే వీల్లేదని ఆవిడ అప్పుడే పైకి అనేసింది. నా అభిప్రాయం కూడా అదేనంటూ, ఎందుకైనా మంచిదని జేబులోనుంచీ మ్యాపు పైకి తీశాను. 'బెన్‌సన్ లాక్' తరువాత వచ్చేలాకు 'విల్లింగ్‌ఫర్డ్ లాక్! అప్పటికి దానికి యింక ఒకటిన్నర మైళ్ల దూరంలో వున్నట్లు ఆమ్యాపును బట్టి పోల్చుకొన్నాను.

"ఇంకేం! విల్లింగ్‌ఫర్డ్ లాకుకి ఏడు గంటల్లోగా చేరిపోతాం. ఆతరువాత యింకొక లాకేవుంది. నిక్షేపంగా భోజనాల వేళకి వెళ్లిపోవచ్చు!" అన్నాను. దాంతో నాకూ ధైర్యంవచ్చింది. గట్టిగా నకిలించి, పట్టుగా తెడ్లువెయ్యటం మొదలుపెట్టాను.

పడవ చాలాదూరం ప్రయాణం చేసినట్లు అనిపించింది. బ్రిడ్జికూడా దాటివచ్చేశాం. అప్పటికి నాకు ఎందుకో అనుమానం తగిలి, "ఏదైనా లాకు తగిలిందేమో నువ్వేమైనా గమనించావా?" అని ఆవిడని హెచ్చరించాను తనకి కూడా లాకు ఏదీ తగిలినట్లు అనిపించటం లేదని ఆవిడ సమాధానం చెప్పింది. అయితే యింకాముందే వుంది కాబోలు లెమ్మని యింకా జోరుగా తెడ్లువెయ్యటం మొదలుపెట్టాను. మరొక ఐదునిమిషాలు గడిచాయి. లాకు కనిపిస్తుందేమో ఆవిణ్ణి కాస్త కనిపెట్టి చూడమన్నాను. కనుచూపు మేర దూరంలో ఎక్కడా లాకువున్నట్లు తన దృష్టికి ఆనటంలేదని ఆవిడ చెప్పింది.

అక్కడికీ ఆవిడ ఏమైనా అనుకొంటుందేమో అని భయపడుతూనే "లాకు అనేది అసలు ఎలా వుంటుందో నీకు బాగా తెలుసా?" అని అడిగాను.

ఆప్రశ్నకి ఆవిడ ఏమీ అనుకోలేదు కానీ, కావాలంటే నన్నే చూడమన్నది. తెడ్లు కిందపడేసి, పడవలో లేచినుంచొని లాకుకోసం నాలుగుమూలలా వెతికాను. ఆమసక వెలుతురులో మైలుదాకా నదీజలాలే పరుచుకొని వున్నాయి కాని, ఎక్కడా లాకు కనిపించలేదు.

"అయితే మనం దారితప్పి వచ్చామంటావా?" అని ఆవిణ్ణి బిక్కు బిక్కుమంటున్న గుండెలతో అడిగాను. దారి తప్పటానికి నిజానికి ఏమీ అవకాశం లేదని నాకు బాగా తెలిసి వున్నప్పటికీ, ఎందుకనో అప్పుడువున్న పరిస్థితిలో, దారితప్పి కొండరాళ్లకి కొట్టుకో బోతున్నామని పైకి అనేశాను.

ఆమాటతో ఆవిడకివున్న కాస్త ధైర్యం ఎగిరి

చిక్కిపోయింది. పసిపిల్లలాగా ఒకటే ఏడుపు లంకించుకొంది. ఆ ఏడుపులు, పెడ బొబ్బల్లోనే, యిద్దరమూ ఆ వేళ ఏ కొండరాయికో గుద్దుకొని చచ్చిపోబోతున్నామనీ, నాలాంటి దౌర్భాగ్యుడితో తాను బయలుదేరినందుకు యింక పెద్దశాస్తి అవుతోందనీ అనెయ్యటం మొదలు పెట్టింది.

ఆవిడని ఎలాగైనా వూరుకోబెట్టాలని నానా యాతనలు పెట్టాను. ఇదంతా వూరికే వేళాకోళం కోసం కావాలని యిలా చేశానని చెప్పాను—అక్కడికీ! లాకు యింకా కనపడకపోవటానికి ఏదో ఒక కారణం చెప్పాలి కాబట్టి, నేను అనుకొంటున్నంత వేగంగా తెడ్లు పడటం లేదనీ, అంచేతనే యింకా పడవ లాకు చేరుకోకుండా వుందనీ చెప్పాను. ఎన్ని చెప్పినా ఆవిడ వూరుకొనేట్లు లేదు. నేనే గుండె రాయి చేసుకొని, లేనిశక్తి తెచ్చుకొని యింకా జోరుగా తెడ్లు వేశాను.

ఎంతదూరం పోయినా లాకు కనిపించక పోయేసరికి నాకే గుండె జారిపోయింది. మళ్లీ మ్యాపు పైకి తీసి చూశాను. అందులో శుభ్రంగా వ్రాసివుంది. 'బెన్‌సన్ లాక్'కి ఒకటిన్నర మైళ్లు దిగువగా 'వెల్లింగ్ ఫర్డ్ లాక్' వున్నట్లు నమ్మకంగా వ్రాసివుంది పోనీ మ్యాపు ఏమైనా తప్పేమో అంటే అది మ్యాపాఅంటే నిక్షేపం లాంటి మ్యాపు. అదికాక 'వెల్లింగ్ ఫర్డ్ లాక్' పేరిటవున్న లాకు నేను యిదివరకు చూసిందే. అక్కడ అది వుండడం నాకు బాగా జ్ఞాపకమే. లోగడ అక్కడికి నేను ఒకసారి కాదు; రెండుసార్లు వెళ్లాను. అయితే యిప్పుడు మా బోటు ఎక్కడవున్నట్లు? అప్పుడు మేము వున్నది అంతా ఒక పీడకలలో భాగమై వుంటుందని నా మనస్సుకి సమాధానం చెప్పుకొన్నాను. మరొక రెండుమూడు నిమిషాలలో మెళుకువ వచ్చేస్తుందనీ, దాంతో యీ క్షోభ వదలిపోతుందనీ నా మనస్సుని వూరుకో బెట్టాలని ప్రయత్నించాను.

"ఇప్పుడు మనం నిజంగా పడవలో ప్రయాణం చెయ్యటంలేదా, ప్రయాణం చేస్తున్నట్లు కలగంటున్నాం కదా?" అని ఆవిడను అడిగాను. ఆవిడ కూడా సరిగ్గా అదే సమయానికి నన్ను అదే ప్రశ్న వేద్దామనుకొంటున్నానన్నది. దాంతో యిద్దరికీ అనుమానం వేసింది — యిద్దరమూ నిద్రపోతున్నామా? నిద్రపోతుంటే మాయిద్దరిలో కలగంటున్నవారు ఎవరు? కలలో కనిపించినవారెవరు? ఏమైతేనేం—ఆ పరిస్థితి మాత్రం మహా చిత్రంగా వుంది."

నేను తెడ్లు వెయ్యటం మాత్రం మానలేదు. అయినా ఎంతకీ లాకు కనిపించనూ లేదు. పోతున్న కొద్దీ నదిపొడుగు పెరిగిపోతున్నదే కాని ఎక్కడా అంతమయ్యే సూచనలు కనిపించలేదు. బయటచీకటిలాగే మా మనస్సుల్లో నిరాశ నిస్పృహకూడా అంతకంతకీ దట్టమై పోతున్నాయి. నా మెదడులో దెయ్యాలు, కొరివిదయ్యాల కథలు మెదలటం మొదలుపెట్టాయి. కళ్లుగట్టిగా మూసుకొని దైవప్రార్థన చెయ్యబోయాను కాని ప్రార్థనాశ్లోకాలు నాకు ఒక్కటీ కంఠతా రావు: నా అజాగ్రత్తకి నన్ను చెడ తిట్టుకొన్నాను.

ఇంతలో ఎక్కడినుంచో చేతి హార్మోనియం వాయిస్తున్న చప్పుడు వినవచ్చింది. మామూలుగా అయితే ఆ మోత నాకు అట్టే యిష్టంవుండదు. కాని ఆ క్షణాన మేమువున్న పరిస్థితిలో మాత్రం ఆ హార్మోనియం మోత నా చెవులకి గాంధర్వవాద్య విశేషంగా తోచిందంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదు. ఆ వాయిద్యంలో నుంచీ జారిపడి నదీ తరంగాల మీదుగా తేలితేలి వచ్చే ఆ పాటల వరసలు వింటుంటే మాకు బ్రతుకుమీద ఆశ పుట్టుకొచ్చింది.

ఆ మధుర సంగీతం అంతకంతకూ దగ్గరగా వినవస్తున్నది. అలా కొద్దిక్షణాలు గడిచేసరికి మరొక పడవ మాకు ఎదురైంది. అందులో యువతీయువకులు ఎవరో వెన్నెల విహారం చేస్తున్నట్లున్నారు. ఆనాటి రాత్రి వెన్నెలలేదు. వెన్నెలలేక పోవటం తమ తప్పు కాదన్నట్లు వాళ్లు పాటలుపాడుతూ కేరింతాలు కొట్టుతున్నారు. కావటానికి వాళ్లు అందరూ కూడా నాకు పరాయివాళ్ళే అయినా, అదేమిటో నా కాక్షణంలో వాళ్లనుమించిన ఆత్మీయులు, సన్నిహితులూ ఎవరూ లేరనిపించింది. ఆత్మీయ భావం వ్యక్తమయ్యేలా వాళ్లని పెద్దగా కేకవేసి, వెల్లింగ్ ఫర్డ్ లాకు కోసం రెండు గంటలుగా వెదుకుతున్నానని, దారిఎటో చెప్పమని వాళ్లని అడిగాను.

"వెల్లింగ్ ఫర్డ్ లాకా?" అవతల పడవలోంచి

(42-వ పేజీ చూడండి)

# దర్బారులో ఏకాంతం

శ్రీ నారికివిల్లి రామారావు

పూర్వకాలమున 'కళింగ' దేశమును, వీరసింహుడను రాజు పరిపాలించుచుండెను. ఇతనికి సూరసేనుడను నొక మంత్రి గలడు. ఈ మహామంత్రి చాల తెలివిగలవాడగుటచే, రాజుగారి కృత్రిమ బుద్ధిని సవరించుకొనుచు, రాజ్యాంగ కష్ట, సుఖాలను ఎదుర్కొనుచు, ప్రజలకు ఏ లోటుపాట్లు లేకుండ చూచుకొనుచుండెడివాడు. అందుచేతనే రాజుకంటే మంత్రియందే ప్రజలకు అభిమానము, మక్కువ ఎక్కువ. అదియునూ గాక ఇతని భార్యయగు 'సుగుణావతి' అందమునకు దిద్దితీర్చిన 'రూపవతి'గా కళింగదేశమంతటనూ పరిగణింపబడుచున్నది. ఇదిట్లుండగా:-

ఒకనాడు వీరసేన మహారాజునకు మంత్రి భార్యయగు సుగుణావతి గుర్తుకొచ్చింది. అప్పుడు ఆమె అందమును తిలకింపవలెనను కొనెను, కాని మంత్రివుండగా, మంత్రి ఇంటికి వెళ్లుటకు సంశయించెను. అందుచే ఒక పన్నాగం పన్ని...సూరసేనుని కప్పముల వసూలుకై విదేశాలకు పంపివైచెను.

సూరసేనుడు బయలుదేరిన మరుసటి దినమే, రాజుగారు మంత్రిగారింటికి బయలుదేరెను. అప్పుడు మంత్రిగారి భార్య సుగుణావతి రాజుగారు తమ ఇంటికి వచ్చుచుండుట గమనించింది. కాని "నా భర్తలేని సమయమున మహారాజు వచ్చెనే ఇప్పుడు నేనే విధముగా గౌరవింపవలయును? మంత్రిగారు లేరని చెప్పి పంపివైచెదమంటే, రేపు నా భర్తవచ్చి "ఇంటికొచ్చిన రాజుగార్ని ఎందుకు గౌరవింపలేద"నునేమో అనుకొనుచుండగనే రాజుగారు వచ్చినట్లు అలికిడి వినిపించింది. వెంటనే సుగుణావతి తన దాసితో లోనికి రమ్మని ఆహ్వానించింది. సరే రాజుగారు వచ్చి హాలులో టేబిల్ ముందున్న కుర్చీలో కూర్చున్నాడు.

చివరకు ఇంటికొచ్చిన రాజుగార్ని తిరస్కరించలేక, గౌరవార్థంగా విందుచేసి పంపదలచుకుంది. కానీ ఇంతలోనే తనకొక సందేహం కలిగింది "ఎన్నడూ రాని రాజుగారు ఈరోజు నా భర్తలేని సమయంలో వచ్చుటకు రాజుగారి భావమేమైయుండును? ఇట్టి పరిస్థితిలో రాజుగార్కి విందుచేస్తే, రేపు లోకం నన్నేమని నిందించును? రేపు ఒకవేళ నా భర్తకు ఏవిధంగా భావం గలుగునో?" ఇవే ఆమెకు గల్గిన సమస్యలు.

ఇట్లు ఆలోచిస్తూండగా ఆమెకొక ఉపాయం తట్టింది. రాజుగారి విందుకొరకు, వెండి, బంగారము, రాగి, కంచు, ఇత్తడి, అల్యూమినియం, మట్టి మొదలగు ఏడు పాత్రలతో పాయసం తెచ్చి టేబిల్ మీద పెట్టినది. రాజుగారు ఏ వుద్దేశ్యంతో వచ్చెనో అని ఒక కంట కనిపెడుతూనే వున్నది.

సుగుణావతే తనకు స్వయంగా పాయసము తెచ్చుచున్నందుకు, రాజుగారు తన హృదయంలోనే ఆమెకు ధన్యవాదాలర్పించాడు. ప్రత్యక్షంగా తన ఎదురుగ నీ పాయస పాత్రలను టేబిల్ మీద పెడుతూంటే, ఆమె అందాన్ని వర్ణించుకుంటూ లోలోన చిరునవ్వు నవ్వుకుంటూన్నాడు. ఇదియంతయు గమనించుచునే యున్నది సుగుణ.

టేబిల్ మీద ఈవిధంగా పాత్రలను చూచేసరికి దాని భావమేమో అర్థంగాక, ఒక్కొక్క గ్లాసు ఎత్తుతూ, దించుచూ, ఏ గ్లాసుకు ఎటువంటి గౌరవమో తెలియక, ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు రాజుగారు. రాజుగారి ప్రవర్తనంతా చూస్తూవున్న సుగుణ "పాత్ర భేదమేకాని అన్నియ్యూ పాయస మన్నిట్లోది ఒకటేగదా" అనెను.

అప్పటికి ఆమె భావమును తెలిసికోగలిగాడు రాజుగారు. వెంటనే తనకేదో అవమానము గలిగినట్లు తోచి, దిగ్గున లేచి మారుమాట్లాడకుండా తన భవనమున కరిగెను.

విదేశమెళ్ళిన సూరసేనుడు



టేబిల్ మీద ఈవిధంగా పాత్రలనుచూచే సరికి దానిభావమేమో అర్థంగాక......

మూడురోజులలో తిరిగి వచ్చెను. రాజుగారు తమ ఇంటికొచ్చినట్లు సుగుణ చెప్పబోయెను. కాని భర్త అనుమానించునేమోనని మెదలకుండెను. కాని, రాజుగారు తన ఇంటి కొచ్చినట్లు, సుగుణావతి రాజుగార్కి విందుచేసినట్లు, దాసిదాని వలన తెలిసికోగలిగాడు మంత్రి. తనభార్యను అనుమానించినప్పటికీ, ఏమీ ఎరుగనట్లు నటించుచూ, పరిష్కారముకొరకు ఎదురు చూచుచుండెను. ఇంతలో 'సంక్రాంతి' పండుగ వచ్చెను. ఈ పండుగ వంకతో పుట్టింటికి పంపించి, తిరిగి తీసుకురాకుండుటకు నిశ్చయించి,

"సుగుణా పండుగ వచ్చినదిగదా? నీకు పుట్టింటికి వెళ్ళవలెనని వున్నది గదా? నాకేమో తీరిక లేదాయె కనుక నీవు వెళ్ళివుండు. తరువాత నేనే వచ్చి నిన్ను తీసుకువెళతాను" అని చెప్పి ఆమెను పుట్టింటికి పంపివైచెను.

ఆమె పుట్టిల్లు 'వంగ' దేశము. ఆమె తండ్రికూడ వంగరాజుదగ్గర మహామంత్రిగా వుండెను. ఈయనకు ఒక్కగానొక్క కూతురే ఈ సుగుణ. కూతురు ఒక్కర్తే వచ్చుటలో తలితండ్రులు భయభ్రాంతులైరి. కూతుర్ని అడిగితేమటుకు ఏమని చెప్పతుంది? సరే కొంత కాలము గడిచింది. చివరకు నెలలు కూడ దాటుతున్నాయి. రోజులు గడుస్తున్నకొద్దీ తన భర్త తీసికెళ్ళుటకై రానందుకు, ఆమె లోలోన కృసించిపోవుచున్నది. కూతురి వాలకం చూస్తూంటే, తలితండ్రుల కేమీ అర్థం కావటంలేదు. "చివరకు కూతురికి అల్లునకు ఏవో మనస్పర్థలు కలిగియుండవచ్చు"నని నిశ్చయం చేసుకున్నారు తలితండ్రులు.

ఆరునెలలు దాటినాయి. ఒకనాటి రాత్రి 8 గంటలకు తల్లీ కూతుర్లు, చల్లగాలిలో విశ్రాంతిగా

(43 వ పేజీ చూడండి)



# దీర్ఘాయువు

(బౌద్ధగాథ) — శ్రీ గోవిందులూరి సాంబశివరావు

చాలాకాలం క్రిందట జరిగిన కథ ఇది అప్పుడు కాశీ రాజ్యం చాలా పెద్దదిగా వుండేది దానికి వారణాసి రాజధానిగా వుండేది దేవదత్తుడనే ఆయన దానికి రాజు ఆయన మహాబలశాలి ఆఢ్యుడు మహా ధనవంతుడు. మహాభోగి. ఆయనకు అపర్యాప్తమైన సైన్యం, పరిపూర్ణమైన కోశం, అనేకమైన వాహనాలు, అతి విశాలమైన రాజ్యం, అన్నీ ఉన్నాయి

అదే సమయంలో కోసల దేశాన్ని దిఘితి అనే రాజు పాలిస్తూ వుండేవాడు. ఈ దిఘితి దరిద్రుడు. అల్పధని. అల్పభోగి అల్పవాహనుడు అల్పసేనుడు అపరిపూర్ణకోశుడు ఆయన రాజ్యం కూడా చిన్నది. కాని దిఘితి కాశీరాజు బ్రహ్మదత్తుని కన్న జ్ఞాని, తెలిసినవాడు.

బ్రహ్మదత్తుని విజిగీషకు అంతు లేదు. అది కీర్తికోసం అయినట్టిది కాదు. అర్థలాభంకోసం అతని ఈ విజిగీష చెల్లుబడిఅవుతూ వుంటున్నది ఇట్టి ఈయనకు కోసల రాజ్యాన్ని కాజేద్దామని బుద్ధిపుట్టి, చతురంగ బలాలను సమాయత్తం చేసుకొని, కోసలరాజు దిఘితి మీదకు దాడివెళ్లాడు. దిఘితి ఆలోచించాడు "కాశీ రాజు బ్రహ్మదత్తుడు బలవంతుడు నేను బలహీనుణ్ణి. ఆయనతో యుద్ధం చేస్తే గెలవు ఎక్కాగూ దక్కదు. నాకోటను పట్టుకోకముందే స్త్రీజనంతో బయటపడి తప్పించుకు పోవడం ఏవిధంగా ఆలోచించినా మంచిదిగా కన్పిస్తున్నది. బ్రహ్మదత్తుడు కోటలో బలాన్ని ప్రవేశించకముందే వెళ్లిపోతాను" అని ఆలోచించి, తన పట్టమహిషిని వెంట పెట్టుకొని, బ్రహ్మదత్తుని సైన్యాలు నగరం పొలిమేరలను తొక్కకముందే, రాజ్యాన్ని శత్రువులకు త్యజించి ఎటకేని వెళ్లిపోయాడు

కాశీరాజు బ్రహ్మదత్తుడు దిఘితి సేనను వశపరుచుకున్నాడు. వాహనాలు తోలుకుపోయాడు. దేశాన్ని హరించాడు. కోశాన్ని కాజేశాడు కోష్ఠాగారాన్ని స్వంతం చేసుకున్నాడు కోసల దేశంలో దిఘితి శాసనాన్ని రద్దుచేసి తన శాసనాన్ని ప్రకటించాడు.

## 2

కోశలరాజు దిఘితి బ్రతుకు అడవుల పాలైపోయింది అక్కడ తిరిగాడు, ఇక్కడ తిరిగాడు చివరకు వారణాసిలో తల దాచుకుంటా

మని మారువేషంతో సభార్యుడై బయలుదేరాడు. వారణాసి సమీపంలో ఒక కోనవుంది. అందులో ఒక కుమ్మరివాడు వుంటున్నాడు. వారణాసిని చేరుకున్న దిఘితి అతనింట్లో అజ్ఞాతవాసం ప్రారంభం చేసి పరివ్రాజకుండై భైక్షుక వృత్తితో గ్రాసవాసోదైన్యాలను మాన్పుకుంటున్నాడు.

కాలం నడిచిపోతున్నది. జీవితం గడిచిపోతున్నది. దిఘితి భార్యకు దౌహృద లక్షణాలు పొడచూపాయి. ఆమెకు విచిత్రమైన కోర్కెలు పుట్టుకు వస్తున్నాయి. సూర్యుడు ఉదయిస్తూ వుండగా, క్రీడా క్షేత్రంలో సాయుధులు, సవర్మలు, అయిన సైనికులు యుద్ధ సన్నాహాలు చేస్తూవుంటే చూడాలని ఆమెకు ఒకప్పుడు ఒకకోర్కె కల్గుతుంది. మరోఅప్పుడు ఖడ్గాలను కడిగి, ఆనీళ్లను త్రాగితే బాగుండు ననిపిస్తుంది. రోజులు గడిచినకొద్దీ ఆమెలో ఈ కోర్కెలు ఉత్కటం అవుతున్నాయి. ఒకరోజున ఆమె ఈకోర్కెల ఉద్ధతిని పట్టలేక భర్త దగ్గిరకు వెళ్లి తన మనస్సు విశదం చేసింది. "స్వామి! నేను గర్భిణిని. నాలో ఇటువంటిదౌహృదభావాలు ఉత్పన్న మౌతున్నవి. సూర్యుడు ఉదయిస్తూ వున్న వేళ క్రీడా క్షేత్రంలో చతురంగ బలాలు సన్నద్ధం అవుతుంటే చూడాలని వుంటుంది. సకృపాణ హస్తులు, సవర్మలు అయిన సైనికులు బరాబరులు తీరుతూవుంటే చూడాలని వుంటుంది. ఖడ్గాలను నీటిలోకడిగి, అనీటిని త్రాగాలని వుంటుంది."

"దేవీ! మనం ఇప్పుడు దుర్గతిలో వున్నాం. ఇట్టిస్థితిలో సేనలు ఎక్కడ నుండి వస్తాయి. క్రీడా స్థలాలు ఎక్కడ వుంటాయి. చతురంగ సేనలను ఎక్కడనుంచి తెస్తాం. ఇక వారు సన్నద్ధం కావడం, బరాబరులు తీరడం, నీవు నిలబడి చూడటం ఎట్లా సాధ్యపడతాయి. ఖడ్గాలు, కడగడం, నీళ్లు త్రాగడం, ఈకోర్కెలు ఎట్లా తీరుతాయి"

"స్వామి! నేను ఏమి చెప్పను! ఈకోర్కెల ఉద్ధతిని తట్టుకోలేకుండా వున్నాను. ఈ ఇచ్ఛను శమింపజేయకపోతే ప్రాణాలు నిలిచేఎత్తు కన్పించడంలేదు. ప్రభూ! నా ప్రాణాన్ని కాపాడండి. నాగర్భస్థ శిశువును రక్షించండి."

దిఘితికి ఏమీపాలు పోలేదు. ఇదియేమి గర్భము! ఇవి ఏమి కోర్కెలు, అతనికి ఏమీ పాలు పోలేదు. ఆలోచన చేశాడు. దీర్ఘంగా ఆలోచించాడు. అతని మనస్సులో ఒక ఊహతోచింది. కాశీరాజు బ్రమ్మదత్తుని పురోహితుడు తనకు స్నేహితుడు. అతని సలహా తీసుకుంటే! అతనితో మాట్లాడితే! దిఘితి వెంటనే బయలుదేరాడు. వారణాసిలో ఆ బ్రాహ్మణ పురోహితుని ఇల్లు ఎక్కడో, అక్కడకు రెక్కలు కట్టుకొని ఎగిరినట్లు నడిచి వెళ్లాడు. దిఘితి రావడంచూచి పురోహితుడు ఎదురువెళ్లి, తీసుకువచ్చి ఉచితాసనం మీద ఆయున్ను ఉపస్థితుణ్ణి చేసి "ఏమి సెలవు" అని ప్రశ్నించాడు.

"సౌమ్యుడ! నాభార్య గుర్విణి అయింది. ఆమెకు విచిత్రమైన కోర్కెలు జనిస్తున్నాయి. సూర్యుడు ఉదయించే వేళ క్రీడారంగంలో సశస్త్రిలు, సవర్మలు అయిన సైనికులు బరాబరులు సెరపుతూవుంటే ఆమెకు చూడాలని వుంటుంది. ధావిత ఖడ్గజలంతో దాహాన్ని ఆర్పుకోవాలని వుంటుంది. ఈకోర్కెలు నేను తీర్చేది ఎట్లా! నీవు నాకు మిత్రుడవు గాబట్టి ఇది అర్థిస్తున్నాను. ఎట్లాగయినా ఆమె ఈకోర్కెలను తీర్చేట్లు మార్గాన్ని నాకు చూపించు."

"ప్రభూ! దేవి ఈకోర్కెలు విచిత్రంగా వున్నాయి. ఒకసారి దేవి దర్శనం దయచేయించండి."

దిఘితి కాళ్లు కాళ్లు కావు. వేఘాలు. ఇంటికి చేరుకునేటప్పటికి నిమిషం పట్టలేదు. ఆత్మమహిషిని వెంటపెట్టుకుని పురోహితుని ఇంటికి వచ్చేసరికి లిప్త గడవలేదు. పురోహితుడు దూరాన్నే ఆదంపతులను చూచాడు. భర్త వెను వెంట వస్తున్న ఆమెను, గర్భవతిని, కోసలరాజు పట్టమహిషిని, అల్లంత దూరంలో వుండగా తిలకించాడు. అతనిమనస్సు ఒక ఉల్లాసాన్ని పొందింది. అతని ముఖం సుప్రసన్నమైంది. ఒక దివ్యానుభవం అతని సర్వ రక్తనాళాల్లోను ప్రవించింది. కూర్చున్నవాడు కూర్చున్నట్లే ఆసనం నుంచి దిగాడు. ఒక్కటే అంగ, అతడు రాణికి ప్రణమిల్లాడు. అతనికి తెలియకుండానే కంఠంలోంచి ఇట్టిమాటలు వచ్చాయి "అహో! ఈగర్భస్థ శిశువు కోసలకు రాజు! ఆహో కోసలరాజును దేవి తనగర్భంలో ధరించివుంది!' అహో! గర్భస్థ శిశువు తేజం దురాసదంగా:

# ★ దీర్ఘాయువు ★

వుంది" ఈమాటలు పురోహితుని చేత మూడుసార్లు ఉచ్చరితాలైనాయి. ఆమాటలు అతడు అంటున్నట్లుగా లేవు. ఏదో దివ్యశక్తి అనిపిస్తున్నట్లు వున్నాయి. అతనికి ఒళ్లు తెలిసింది. రాణి కన్పించింది. రాణి కోర్కెలు వినిపించాయి. రాణితో ఆయన ఇలా అన్నాడు: "దేవీ! ప్రసన్నురాలవు కా. సూర్యుడు ఉదయిస్తూ వుంటాడు. సశస్త్రము, సవర్మము అయిన సైన్యం క్రీడాక్షేత్రంలో బరాబరులు నడుస్తుంది. నీవు చూస్తావు. ఖడ్గాలు నీటితో ధావితాలు అవుతాయి. ఆజలాన్ని నీవు క్రోలుతావు."

పురోహితుడు మరోక్షణంలో అచ్చటలేడు. కాశీరాజు బ్రహ్మదత్తుడు ఎక్కడవున్నాడో, అక్కడకు వెళ్లాడు. వెళ్లి "ప్రభూ! నాదిఒక కోరిక వుంది. ఆకోర్కెను మీరు మన్నించాలి. రేపు ఉషోవేళ క్రీడాస్థలంలో సైన్యసన్నాహం చేయండి సశస్త్రము, సవర్మము అయిన చతురంగ బలాన్ని నిలపండి. ఖడ్గాలను కడిగించండి. ఈసాయం నాకు చేయండి" అని అర్థించాడు. కాశీరాజు వెంటనే తన మనుష్యులకు ఆజ్ఞ ఇచ్చాడు. రాజ పురోహితుడు ఎట్లా చెప్పాడో, అట్లా చేయవలసిందిగా ముదల ఇచ్చాడు.

తెల్లవారుతున్నది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. క్రీడాస్థలం సన్నాహం చేయబడింది. చతురంగ సైన్యం సశస్త్రమై, సవర్మమై వచ్చి నిలచింది. కోసలరాజు పట్టమహిషి క్రీడారంగంలో నిలబడి వుంది. సైన్యం అంతా తనకు తెలియకుండా బరాబరులు నడిచింది. ఖడ్గాలను కడిగింది. రాణి ఆజలాన్ని ఆత్మతృప్తిగా క్రోలింది.

## 3

దీఘితి రాజు భార్యకు నవమాసాలు నిండాయి. ఒకరోజున ఆమెకు నొప్పులు వచ్చాయి. దీఘితికి ఆ బాధ అంతా తాను పడుతున్నట్లు వుంది. రాణి ప్రసవించింది. రాజు మనస్సు హాసించింది. దీఘితికి కొడుకు కల్గాడు. కాశీరాజ పురోహితుడు స్వయంగా వచ్చి పసివానికి జాత కర్మాదికాలు నడిపించాడు. తల్లి దండ్రులు కుఱ్ఱవానికి దీర్ఘాయువు అని పేరు పెట్టారు.

కుమార దీర్ఘాయు పెరుగుతున్నాడు. పెద్దవాడౌతున్నాడు. బుగ్గలమీద పచ్చి ఆరలేదు, అతడు విజ్ఞుడైనాడు. దీఘితి కుఱ్ఱవాణ్ణి చూచుకుంటూ ఆలోచనలు చేస్తున్నాడు. అతని మనస్సుకు ఇట్లా అనిపించింది: "ఈ కాశీరాజు బ్రహ్మదత్తుని కారణంగా నాకు సకలమైన అనర్థాలు సంప్రాప్తమైనాయి. నా సేన, నావస్తువులు, వాహనాలు, దేశము, కోశము, అన్నింటిని ఈ బ్రహ్మదత్తుడు తనపాట్టను పెట్టుకున్నాడు. ఇప్పుడు మేము ముగ్గురము ఇక్కడ వున్నట్లు తెలిస్తే, మమ్మల్ని చంపి కాకులకు, గ్రద్దలకు కూడా కాకుండా చేస్తాడు. మా భార్యా భర్తల సంగతి సరే! దీర్ఘాయువును రక్షించుకోవాలి. నగరంలో కాక అతని నగరానికి దూరంగా ఆవాసం ఏర్పాటు చేయాలి."

అనుకున్న విధంగా దీఘితి, కుమార దీర్ఘాయువుకు నగరానికి దూరంగా ఆవాసం ఏర్పాటు చేయించాడు. అట్లా నగరంబయట నివశిస్తూనే, దీర్ఘాయువు సర్వవిద్యలు నేర్చాడు.

## 4

కుమార దీర్ఘాయు ఈవిధంగా సర్వవిద్యా పారంగతుడౌతున్న సమయంలోనే దీఘితి అజ్ఞాతవాసం అజ్ఞాత జీవనం అంతా కాశీరాజు బ్రహ్మదత్తుడికి తెలిసిపోయింది. పరిబ్రాజక రూపంతో వారణాసీ నగరంలో కాలాన్ని వెళ్లబుచ్చుతున్న దీఘితి దంపతులకు దుష్టపువేళ ఘటిల్లి, బ్రహ్మదత్తుని గూఢచారుల కళ్లబడ్డారు. ఇక వారికి చెప్పవలసింది ఏమివుంది. బ్రహ్మదత్తుని వద్దకు వెళ్లి సర్వ వృత్తాంతాన్ని నివేదించారు. "ప్రభూ! నగరానికి సమీపంలోవున్న ఒక వనంలో దీఘితి పరిబ్రాజక రూపంతో భార్యతోసహా వుంటున్నాడు. ఏమి సెలవు!" అని అడిగారు. బ్రహ్మదత్తువారికి కానుకలు ఇచ్చాడు. కోసలరాజు ఉనికి తెలిసిన అతని సంతోషాన్ని శరీరం పట్టలేక పోయింది. "వెళ్లండి! ఆకోసలరాజును, ఆకోసలరాజు పెళ్లాన్ని ఇద్దరిని బంధించి తీసుకురండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

రాజు చూచి రమ్మంటే కాల్చివచ్చేరకం ఈభటులంతా. రాజు నోటి వెంటవస్తున్న ఈమాటలు పూర్తికాలేదు, వారు వెళ్లడం, దీఘితి దంపతులను ఖైదు చేసి తీసుకు

రావడం, జరిగిపోయినాయి. రాజు ముందు వారిని వారు నిలబెట్టారు. రాజు తిరిగి ఆజ్ఞ ఇచ్చాడు. "వెళ్లండి! మంచి తాడు, గట్టిది, పెద్దది తీసుకురండి. ఈ ఇద్దరి రెక్కలు వెనక్కి విరిచి కట్టండి. ఇద్దరి తలలు చక్కగా ముండనం చెయ్యండి. చేసి బాజాలు, భజం త్రీలు పెట్టి ఇంటి ఇంటిముందు నిలుపుతూ, వీధి వీధినీ ఊరే గించండి. అన్ని వీధులు పూర్తి

## ★ దీర్ఘాయువు ★

అయినతర్వాత దక్షిణ ద్వారం దగ్గరకు తీసుకువెళ్లి, నగరం దక్షిణ దిశలో నిలిపి, నాలుగుముక్కల క్రింద నరకండి. నరికి ఆముక్కలను నాలుగు దిశల్లోను బలిఇవ్వండి"

భటులు "చిత్తం అంటే చిత్తం" అన్నారు. రాజు ఆజ్ఞాపించినట్లు కోసలరాజు దిథితిని, ఆయన భార్యను, పెద్ద తాడును, పొడుగైన దాన్ని గట్టిదైన దాన్ని తెచ్చి, రెక్కలు వెనక్కి విరిచికట్టి పదునైనకత్తి తెచ్చి, తలలు గొరిగి, ఇంటి ఇంటిముందు నిలుపుతూ, వీధి వీధిని ఊరేగిస్తున్నారు. ఇంకా దక్షిణద్వారం రాలేదు. జనం మూగి చూచే వారు ముగిచూచే వారు గాను, అయ్యో! పాపం! అనేవారుగాను, ఎంతవానికి ఎంత అవస్థ వచ్చింది అనేవారు, ఎంత వానికి ఎంత అవస్థ వచ్చింది అనే వారుగాను, వున్నారు. ఊరేగింపు దారిని ఊరేగింపు జరుగుతున్నది. ఇంతలో కుమార దీర్ఘాయువు అక్కడికి వచ్చాడు. (ఇంకా వుంది)

## ★ ఎనాటు విూ థియేటర్లో ★

(23 వ పేజీ తరువాయి)

కోపం వచ్చింది. ఏమిటో వాడి అభిప్రాయం. 'నోరు మూయరా, చులాగ్గా మాట్లాడ్డం చాల తేలికయిన విషయం కానీ - అంతకంటె హైన్యం మరొకటి వుండబోదు' అన్నాను.

'నా అభిప్రాయం అడిగావు కనుక చెప్పాను, నీకు కోపంవస్తే నేనేంచేయను.' అన్నాడు విశ్వనాథం మొహంమాడ్చుకుని. 'సరేలే...పోయి చేతులు కడుక్కురా' అన్నాను యిక ఆప్రస్తావన మారుద్దామని. 'టైం ఎంతయిందిరా' అని వెనక్కి తిరిగి ఓ మారుగడియారంకేసి చూచివెళ్లాడు. యింకా పదినిమిషాలుంది. థియేటర్ అంతా xజిబిజిగావుంది. డిస్సెక్షన్ పూర్తి చేసి స్కిన్‌ఫ్లాప్స్ వేస్తున్నవాళ్లూ, తాము ఎక్స్‌పోజ్ చేసిన స్ట్రక్చర్స్‌ని యితరులకు చూపిస్తున్న వాళ్ళూ...సర్వం పూర్తిచేసుకుని వాష్‌బేసిన్ దగ్గిరికి వెళ్తున్నవాళ్లూ - అంతా హడావిడిగా వుంది. ఎక్కణ్ణించో కొట్టుకొచ్చాడు సదాశివం. వాడి మొహంలో సంతోషం నాట్యమాడ్తూంది.

'ఒరేయ్...విస్నావా' అన్నాడు. వాడిమొహం కేసి చూశాను.

'కొత్తబాడీ వచ్చింది చూశావా... దాంట్లో మాకు ఎబ్డోమెన్ యిచ్చాడు' అన్నాడు. విశ్వనాథం చేతులు కడుక్కునివచ్చి పుస్తకాలు పట్టుకుంటూ 'అయితే నువ్వు చేసేది' అన్నాడు. సదాశివానికి వ్యంగ్యం అర్థమయినట్లులేదు: విశ్వనాథంకేసి చురచుర చూచి నావైపు తిరిగి, మెల్లిగా 'అదికాదురా బ్రదర్. థోరాక్స్ ఎవళ్లకి ఎలాట్ చేశాడో తెలుసా: వాసంతీ అండ్ హెర్ పార్టనర్ గాట్ ది థొరాక్స్-' అని ఓ చిఱునవ్వు విసరి పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

విశ్వనాథం నావైపు చూచి 'మాట్రా - వీడి సరదా మండా' అన్నట్లు పెదవి విరచి 'యీ వేళ సదాశివానికి పండగే' అన్నాడు.

బైట బెల్ మ్రోగింది. అంతా లేచి వాష్‌బేసిన్ కేసి పోతున్నారు. అందరి మొహాల్లోనూ పడినకష్టాల అట్టడుగునుంచి వచ్చిన తృప్తికి ఏదో అవుపిస్తోంది. సావిత్రి మొహంలోని భావాలు కళ్లల్లో కేంద్రీకరింపబడి వున్నాయి. సావిత్రి ఎప్పుడో వెళ్ళిపోయింది, నిశ్చలంగా, నిశ్శబ్దంగా పడుకున్న శవాల మధ్యనించి. బైట బస్సు ఆగిన శబ్దాన్ని చెవురు వేసుకుంటూ విశ్వనాథం వెనకాతల నడిచాను... ★

## ★ ముచ్చటగా ముగ్గురు ★

(౩౯ వ పేజీ తరువాయి)

వాళ్లు అతి ఆశ్చర్యంగా అడిగారు 'అవునన్నాను "

"చంపేశారు. ఆలాంకుని ఏడాదిక్రితమే ఎత్తేశారండీ. ఇప్పుడా పేరుతో లాంకు ఎక్కడా లేదు. దాని కోసం వెతకటం మానేసి యింకొంచెం ముందుకి ప్రయాణం సాగించారంటే 'క్లీవ్' రేవు వస్తుంది. అక్కడి కెళ్లండి!" అని నన్ను హెచ్చరించి "వెల్లింగ్ ఫర్డ్ లాకు కోసం వెదుకుతున్నాడురా యీాయన ఎవడో కాని!" అని వాళ్లల్లో వాళ్లు నవ్వుకోవటం మొదలుపెట్టారు.

వెధవది — వెల్లింగ్‌ఫర్డ్ లాకు ఎత్తేశారని నాకు తెలియనే తెలియదు. తెలిస్తే దానికోసం యింత సేపు వెతికేవాడినే కాదు. ఇంతమంచి వార్త చెప్పినందుకు వెంటనే వెళ్లి వాళ్లందరినీ గట్టిగా కౌగలించుకొందామని పించింది. కాని అందుకు వీల్లేకుండా అక్కడ నది అతివేగంగా ప్రవహిస్తోంది. వారిపట్ల నాకు కలిగిన కృతజ్ఞత నంతటినీ మాటల్లో మాత్రమే వెల్లడించి వూరుకోవలసి వచ్చింది.

నేనూ, నాతోపాటు ప్రయాణం చేస్తున్న ఆ అమ్మాయి కూడా, వాళ్లు కనుచూపు మేరదాటి పోయేదాకా చేతిరుమాళ్లు వూపుతునే వున్నాం. వాళ్లందరినీ ఒక్క వారంరోజులపాటు మాయింటికి వచ్చివుండి మా ఆతిథ్యం స్వీకరించమని కూడా ఆహ్వానించినట్లు నాకు లీలగా జ్ఞాపకం.

ఇక అక్కడనుంచీ ఆ అమ్మాయీ నేనూ ధైర్యంగా పాటలు పాడుకొంటూ భోజనాలవేళకి కొంపకి చేరిపోయాం.

(ఇంకావుంది)

# ★ దర్బారులో ఏకాంతం ★

(37–వ పేజీ తరువాయి)

మేడమీద కూర్చుని వున్నారు వారి ప్రక్కనే దాసీది మంచములు వేయుచున్నది

ఆ రోజే నిండుపూర్ణిమ చల్లగా వీచే పిల్లగాలులకు తోడుగా, విండారబోసినట్లు వెన్నెల కాస్తూ, వాతావరణం ఎంతో ప్రశాంతంగా చేస్తూన్నాడు చంద్రుడు అప్పుడు సుగుణ తల్లి వూరుకుండలేక "ఏమేవ్ ఇటు చూడవే ఈ చంద్రబింబం ఎంత తేజస్సుగా వుందో" అని దాసీదాంతో అంది అప్పుడు దాసీది "ఎంత ప్రకాశవంతమైతే నేం లాభం ఆ మచ్చ వాళకే చెడగొడుతూందమ్మా" అనేసరికి, బుజాలు తడుముకుంటూన్న సుగుణ ఇదంతా 'నన్నే' గదా అనుకుని, "మచ్చ గేనా వస్తే ఇందాకా ఎందుకు వస్తాను? అక్కడే చచ్చేదాన్ని" అని వెంటనే అనేసరికి అప్పటికి శ్రద్ధగా తల్లికి బోధపడింది కూతురు సంగతి.

ఆరాత్రే సుగుణ తల్లి ఆమె తండ్రితో. .ఈ విషయమంతా వివరించి చెప్పి "వెంటనే అమ్మాయిని తీసుకువెళ్ళి, సంగతి తెలిసికొని, దిగబెట్టి రావలసింది"గా ప్రాధేయపడింది "సరే" నన్నాడు మంత్రిగారు. ఆ మరుసటి దినముననే బయలుదేరినారు తండ్రి కూతుర్లు.

వీరసింహ మహారాజుగారు దర్బారుకు రావటంతోడనే, వంగదేశపు మహామంత్రిగారు వస్తూన్నారన్న వార్త చెవినిపడింది వెంటనే కొంత పరివారాన్ని ఎదురు పంపించినారు. సూరసేనునికి మామగారని వీరసింహునికి తెలుసు. అందుచేత వంగదేశపు మంత్రి వస్తున్నాడనగానే, ఆనాడు సుగుణ ఇంటికి వెళ్ళిన విషయం గుర్తుకొచ్చి గుండె బరువెక్కింది రాజుగార్కి. 'తనకూతురు చేసినది తప్పువని' అనుకుని మామగారు సూరసేనుని ముఖం చూడలేకపోయాడు

వంగదేశపు మంత్రిగారు ప్రవేశించగనే, దర్బారులో వేచియున్న ప్రజలందరూ ఒక్కసారిగా మాటు మణిగి చెవులను నిక్కపొడుచుకుని, చూస్తూన్నారు. మంత్రిగారు వచ్చే రావటంతోనే రాజుగార్కి నమస్కారా లర్పించెను మామగారిని చూడగనే క్రోధజ్వాలలను గ్రక్కుచున్నాడు సూరసేనుడు కానీ రాచపద్ధతి ప్రకారం మామగార్కి ప్రజలకు పరిచయపరచి మామగారికొరకు సింహాసనం చూపించి, తన సింహాసనంమీద తాను కూర్చున్నాడు

వెంటనే వంగదేశపు మంత్రి లేచి "మహారాజాధిరాజా తమ అనుజ్ఞానుసారం నాకొక తీర్పు గావింపగా వచ్చితి సెలవిండూ" అనెను. అప్పుడు రాజుగారు "మహామంత్రీ అదేమిటో చెప్పవచ్చు" ననెను అప్పుడు వంగదేశపుమంత్రి "మహారాజా కాసే పూసే కంది చేనుఎవరన్నానడిమికినరుకుతారా" అనేసరికి సూరసేనునికి, రాజుగారికి కూడా అర్థమయింది "ఓహో ఇది నాభార్య విషయమేగదా" అనుకొని, సూరసేనుడు ఇలాఅన్నాడు· "మహారాజా కడకు సముద్రం పొంగినది, కాబట్టి నరికితేమట్టుకు నష్టమేమిటి" అనేసరికి,

"అహా!! సూరసేనుడు ఇలా అనుమాన పడ్డాడా?' ఇదంతా అసలు నాగురించేగా, ఇతనికి, ఇతని భార్యకి ఎడబాట్లకు కారణం. ఈ అవకాశం పోగొట్టుకోకుండా, ఎవ్వరికి అనుమానం లేకుండా నిజంచెప్ప వలయు"ననుకొని "ఏమోయీ సూరసేనా కడకు సముద్రం పొంగి తేమట్టుకు, అన్నా - చెల్లెలు గట్టు, అడ్డువున్నది గదా" అనేసరికి అప్పటికి ఎధార్థం తెలిసికోగలిగి, సిగ్గుతో తలవంచుకున్నాడు సూరసేనుడు

ప్రజలు ఇది అంతా వింటూ ఉన్నారేగాని ఎవ్వరికి, బోధపడక, తెల్లమొఖాలు వేశారు ఇంతలోనే సూరసేనుడులేచి "నేడు ఇంతటితో దర్బారు సమాప్తి అన్నాడు ...

ఇక ప్రజలలో కోలాహలం బయలుదేరింది ప్రజలెవ్వరికి అర్థం కానందువల్ల దీనిని - "దర్బారులో ఏకాంతం" అన్నారు.

అప్పటినుండి సూరసేనుడు, తన భార్య, "పేరుకు తగ్గ సుగుణవతి" అనుకొని, నాటినుండి నేటికి కూడ అన్యోన్య దాంపత్య జీవితాన్ని అనుభవిస్తూ, జీవితయాత్ర గడుపుతున్నాడు.

★



"చిత్రకారుని ముందువున్న మూర్తి ఎంత నిశ్చలంగావుంటే అంతమంచిది."

రోహిణీ వారి ప్రొడక్షన్ నెం 9 లో జానకి, ఎన్ టి రామారావు



శ్రీ ప్రసన్నా ఫిలింస్‌వారి "బలవంతంపెళ్లి" చిత్రంలో నాయిక పాత్రధారిణి శ్రీమతి శోభ

# ★ ఆదీ - ఇదీ ★

కిందటనెల 24 వ తేదీన హిందీనటుడు ప్రేమ్‌నాధ్ మద్రాసు వచ్చారు. ఆరోజునే ఆయన స్వయంగా నిర్మించిన మొదటి చిత్రం "షగూపా" స్టార్ టాకీసులో విడుదలయింది. ఆరోజు మూడు ఆటలకు ప్రేమ్‌నాథ్ హాజరయ్యారు. సాయంత్రం 5 గంటలకు కన్నిమరా హోటల్‌లో ఆయన పత్రికా ప్రతినిధులను సమావేశంచేసి ఇష్టాగోష్ఠి జరిపారు. "షగూపా" చిత్రంపై ప్రజలఅభిప్రాయం స్వయంగా తెలుసుకోనేందుకు తాను దేశంలోని ముఖ్య కేంద్రాలను సందర్శిస్తున్నానని ఆయన అన్నారు. భార్య బీనారాయ్ ప్రస్తుతం బాలింతరాలుగా ఉండడంవల్ల ఆమె తనతో రాలేకపోయిందని అన్నారు.

పత్రికా విలేఖరులు అడిగిన అనేక ప్రశ్నలకు సముచిత సమాధానాలు చెప్పారు. తానెప్పుడూ నవ్యతకోసం అన్వేషిస్తూ వుంటాననీ, "షగూపా" చిత్రంలో మనోవ్యాధిగ్రస్తురాలైన (*Neurotic*) ఒకయువతిని, మనోవ్యాధినిపుణుడైన ఒక డాక్టరును (*Psychiatrist*) ప్రవేశపెట్టాననీ, ఈ రెండు పాత్రలూ మన దేశానికి కొత్తేననీ అన్నారు. ఈ పాత్ర నిర్వహణంలో మీరు విజయంపొందా రనుకుంటున్నారా, అని ఒకరడిగిన ప్రశ్నకు, తాను విజయంపొంది వుండకపోవచ్చుననీ, నిర్మాత కూడా నూతనుడు కనుక అనుకున్నవన్నీ సాధించలేకపోవచ్చుననీ, తానుమాత్రం నెగ్గినా నెగ్గకపోయినా కొత్తదనంకోసం ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తూనే వుంటాననీ ఆయన అన్నారు.

ప్రేమనాథ్ చెప్పిన దానిలో కొంతవరకూ నిజంవున్నది. పైన చెప్పిన రెండు పాత్రలూ మన చిత్రాల్లో ఎవరూ ప్రయత్నించినట్టు లేదు. అయితే హాలీవుడ్ నుండివచ్చిన సైకాలాజికల్ చిత్రాలను చాలా వాటిని చూసినవారికి ఈ చిత్రంలో కొత్తదనం కనిపించకపోతే ఆశ్చర్యంలేదు. మానసిక వ్యాధులను మన స్తత్వ పరిశీలన (సైకోఎనాలిసిస్) దృక్పథంనుండి చూడడం, ఆ వ్యాధులకు చికిత్స చేయడానికి ప్రత్యేక నిపుణులుండడం అమెరికాలో సర్వసామాన్యంగా జరిగేపని. దాన్ని తీసుకువచ్చి భారతీయ వాతావరణంలోకి ఇరికించడం విజాతీయ మనిపించుకుంటుంది.

* * *

ప్రేమనాథ్ తాను తీయబోయే కొత్త చిత్రాన్ని గూర్చి కొన్ని వివరాలిచ్చారు. "ప్రిజనర్ ఆఫ్ గోల్కొండా" అనే



ప్రకాశ్ ప్రొడక్షన్సువారి "బూరెల మూకుడు"లో రామకృష్ణ, మోహన్, లక్ష్మణ్.

పేరుతో గేవాకలర్‌లో ఒక సాంఘిక చిత్రం తీయబోతున్నాననీ, దానికి తానే దర్శకత్వం వహిస్తాననీ, ఆయన అన్నారు 1942 ఆగస్టు ఉద్యమంతో ఈ చిత్రం కథ ప్రారంభమవుతుంది 1947 ఆగస్టు 15 స్వాతంత్ర్య దినంతో అంతమవుతుంది ఒక రాజకీయ ఖయిదీ పాత్రద్వారా ఆ కాలపు రాజకీయ వాతావరణం చూపించబడుతుంది ఈచిత్రంలో బీనారాయ్‌కు ప్రధానపాత్ర లేదనీ, 'గెస్ట్ స్టార్'గా మాత్రమే కొద్ది దృశ్యాల్లో పాల్గొంటుందనీ ప్రేమనాథ్ చెప్పారు

ప్రస్తుతం సినిమారంగంలో ఏర్పడిన మాంద్య పరిస్థితికి కారణమేమిటని ఒక రడిగారు. ప్రజలవద్ద ఇదివరకువలె వినోదానికి ఖర్చు పెట్టేందుకు ధనం లేదనీ, ప్రజలు సినిమాలు చూడడం మానకపోయినా ఉన్న వాటిలో మంచిదని నలుగురూ చెప్పిన వానికే హాజరవుతున్నారనీ, అందుచేత నే అనేక చిత్రాలు వాటి డబ్బు అవి రాబట్టుకోలేకపోతున్నాయనీ అన్నారు

యథార్థ జీవితం ప్రతిబింబించే చిత్రాలకు డబ్బు రాదనుకోవడం తప్పని ప్రేమనాథ్ అన్నారు ఉదాహరణగా బొంబాయిలో కొత్తగా విడుదలైన "దో బిఘా జమీన్" చిత్రాన్ని పేర్కొన్నారు ఈ చిత్రం ప్రజలను విశేషంగా ఆకర్షించు తున్నదనీ, ఇకముందు భారతీయ చిత్రాల భవిష్యత్తు ఇటువంటి చిత్రాలపైనే ఆధారపడి వున్నదనీ అన్నారు

* * *

బొంబాయిలో ఈచిత్రం ప్రివ్యూకు హాజరైన రాజకపూర్ కూడా సరిగ్గా ఆ మాటే అన్నాడట. బిమల్ రాయ్ డైరెక్టు చేసిన ఈ చిత్రం గురించి బొంబాయి పత్రికలన్నీ ముక్తకంఠంతో ప్రశంసలు వ్రాస్తున్నాయి ఇంత గొప్పచిత్రం ఇండియాలో ఎప్పుడూ తయారుకాలేదనీ, ఏ విదేశంలోనైనా ఈ చిత్రాన్ని సగర్వంగా 'ఇది నూటికి నూరుపాళ్ళు భారతీయ చిత్రం' అని ప్రదర్శింపవచ్చుననీ పలువురు అంటున్నారు

"దోబిఘా జమీన్"లో పేద రైతుల జీవితం కథావస్తువట ఈ కథావస్తువుతో ఇదివరలో తెలుగులోను, ఇతర భాషల్లోను చిత్రాలు రాకపోలేదు నిర్వహణంలో అవన్నీ విఫలమైనవి వాస్తవికతను పాటించకపోవడం, జీవితాన్ని, వ్యక్తులను సానుభూతితో అర్థం చేసుకోలేకపోవడం ఈ వైఫల్యానికి కారణాలు వాస్తవ జగత్తులో కనిపించని పాత్రలను, సామాన్య మానవులకు అనుభవంలోకి రాని ఉద్రేకాలను, పరిస్థితులను కల్పించి తీసిన చిత్రం ఎన్నటికీ మంచి చిత్రం అనిపించుకోదు. "దోబిఘా జమీన్" అందరూ ప్రశంసిస్తున్నారంటే యథార్థాన్ని యథాతథంగా ప్రతిబింబించడానికి, ఎక్కడా అతిశయోక్తి, అసహజత్వం లేకుండా సమస్యలను చిత్రించడానికి ప్రయత్నం జరిగిందని మనం ఊహించాలి

ఈ చిత్రాన్ని రష్యన్ ప్రతినిధులు కొందరు చూసి చాలా గొప్ప చిత్రమని మెచ్చుకున్నారనీ, తమ దేశంలో ప్రదర్శించడానికి దీన్ని ఎన్నుకున్నారనీ తెలుస్తోంది సాధారణంగా ఇతరదేశాల సినిమా చిత్రాలను మెచ్చుకోని రష్యన్లు ఈ చిత్రంతో సంతృప్తి పొందారంటే, అందులో ఏదో విశిష్టత ఉంటుందని మనం ఆశించవచ్చును. ★



తల్లి జైలుకు పోయిన వార్త విని ఏడుస్తున్న ముత్తణ్ణి ఓదారుస్తున్న ఉపాధ్యాయుడు

ప్రసాద్ ఆర్ట్ వారి "పెంపుడు కొడుకు"లో కేశవరావు, మోహన్, పిల్లలు

## ఆలిండియా రేడియోవారి కొత్త ఎక్స్పెరిమెంట్

ప్రముఖ ఆంధ్రవైణికుడు శ్రీ ఈమని శంకరశాస్త్రి ఇటీవల "శిఖరారోహణం" అనే 'సింఫనీ' కంపోజ్ చేయగా ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రంవారు దాన్ని రికార్డు చేశారు. శాస్త్రిగారు ఆరు వీణలతో ఈ 'సింఫనీ' కంపోజ్ చేశారు. ఆరు వీణలు ఏకకాలంలో భిన్న స్థాయీలలో పలుకుతాయి. ఎవరెస్టు శిఖరం ఆరోహించడానికి మానవుడు ప్రయత్నించడం, చాలసార్లు విఫలుడు కావడం, వైఫల్యం పొందినకొద్దీ అతని ఉత్సాహం ఇనుమడించడం, చివరికి ఆశిఖరాన్ని జయించడం, అక్కడ శివపార్వతులు దర్శనమివ్వడం, దేవకన్యలు నాట్యం చెయ్యడం, మానవుడు

(51-వ పేజీ చూడండి)

## ఎర్నెస్ట్ హెమింగ్వే చిత్రం

ప్రసిద్ధ అమెరికన్ జర్నలిస్టు, రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వే వ్రాసిన *Snows of Kilimanjaro* (కిలి మంజారో హిమాలు) అనే కథను ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్ వారు సినిమా తీశారు. ఈ చిత్రం న్యూ గ్లోబ్‌లో విడుదలయింది. దర్శకుడు హెన్రీ కింగ్. గ్రెగరీపెక్, సుసాన్ హేవర్డ్, ఆవా గార్డ్నర్ మున్నగువారు నటించారు.

కిలి మంజారో అనేది ఆఫ్రికాలోకెల్లా ఎత్తయిన పర్వత శిఖరం (19,710 అడుగులు). ఆ పర్వత ప్రాంతంలో కాలం గడపడానికి ఒక రచయిత, భార్యతో సహా వస్తాడు. అతడికి కాలిమీద పెద్ద గాయమై బాధపడుతూ వుంటాడు. ఆ బాధతో అతడు మంచంపై పడుకుని, తన గత జీవితమంతా నెమరు వేసుకుంటాడు. అతడి ప్రేమ ఘట్టాలు, అతడి విజయాలు, అపజయాలు అన్నీ 'ఫ్లాష్ బాక్'లో చూపించబడతాయి. ఈ చిత్రం టెక్నికలర్‌లో తీయబడినందున, ఆఫ్రికన్ అరణ్యాలు, పర్వతాలు, మైదానాలు సుందరమైన వర్ణశోభతో కనిపిస్తాయి. గ్రెగరీ పెక్ రచయితగా చాలా బాగా నటించాడు. కొన్ని కొన్ని ఘట్టాలు చాలా బిసువుగా చిత్రించబడ్డాయి.





నవయుగవారి "జ్యోతి"లో రామచంద్ర కాశ్యప.



# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ పా. కా. వెం. రాజేశ్వరరావు—
విజయనగరం

"ముచ్చటగా ముగ్గురు" కథయిత "జెరోమ్-కె-జెరోమ్" ఏ దేశస్థుడు?

—ఇంగ్లండు దేశస్థుడు

* * *

శ్రీ వి. వి. వి. ఆర్. సుబ్బారావు—
సింగవరం

పత్రికలలో 'దారు' చిత్రాలని, 'లినో కట్' చిత్రాలని ప్రచురిస్తూవుంటారు! అవి ఏమిటో తెలియచేస్తారా?

—'దారు' అంటే కొయ్య. కొయ్యమీద వులితోగాని మరేదైనా పదునైనపనిముట్టుతో గంట్లుపెట్టి, ఆగంట్లతోనే ఒకచిత్రం తయారుచేస్తారు. గంట్లు పెట్టటం పూర్తి అయ్యాక దానికి 'ప్రింటింగ్ యింక్' పూసి కాగితంమీద అచ్చు వొత్తితే బొమ్మ తయారు అవుతుంది. అలాంటి బొమ్మల్ని దారు చిత్రాలు (*Wood-cuts*) అంటారు.

—లినోలియమ్ అని ఒకరకమైన రబ్బరులాంటి పదార్థం బజారుల్లో దొరుకుతుంది. దీన్ని సామాన్యంగా ధనవంతుల యిళ్లల్లో నేలమీదా, బల్లలమీదా పరిపించి వుంచుతారు. దీన్నే చిత్రకారులు కత్తితో కోసి, అనవసరమైన భాగాలుతీసి బొమ్మఆకారం వచ్చేట్లు చేస్తారు. ఆతరువాత 'ప్రింటింగ్ యింక్' పూసి కాగితంమీద అచ్చు వొత్తుతారు. ఈ చిత్రాలని లినోకట్ చిత్రాలంటారు.

* * *

శ్రీ డి. వెంకట్రావు—కొత్తగూడెం.

ఈ శతాబ్దము అణుయుగం అని నేను, ప్రజాయుగం అని నాస్నేహితుడు, ఈవిధముగా వాదించుకుంటున్నాం. ఇంతకూ ఇది మీరు ఏయుగమంటారు?

—ఇంత స్వల్పవిషయంమీద మీరిద్దరూ వాదించుకోవడం చూస్తే ఇది కేవలం "వాదనయుగం" అనిపిస్తోంది.

* * *

శ్రీ జామి నూకరాజు—పెంటపాడు.



ఆ చిత్రంలోనే సుసాన్ హేవర్డ్

అమెరికాలోను, యిరోపాలోను డాక్యుమెంటరీలు ప్రదర్శించేవి ఎంతో కొలది సినిమాథియేటర్లు ఉన్నవికదా! యింతవిశాల స్వతంత్ర భారతదేశంలో అటువంటిచిత్రాలు మచ్చుకైన లేకపోవడానికి కారణం? విదేశీయులు నోచుకున్న పుణ్యమేమిటి? స్వదేశీయులు చేసుకున్న పాపమేమిటో తెలియజెయ్యండి?

—మనదేశంలో యూనియన్ ప్రభుత్వపు ఫిల్ముశాఖ చాలా డాక్యుమెంటరీలు తీసిన సంగతి మీరెరుగరా? వాటిలో కళలకు, చేతిపనులకు, సైన్సుకు, తదితర విషయాలకు సంబంధించిన అనేకచిత్రాలు ఉన్నాయి. ఇవి అన్నిచోట్లా ప్రదర్శింపబడుతూనే వున్నాయి. అయితే ఇతర దేశాల్లో మాదిరిగా మన ప్రైవేటు నిర్మాతలు డాక్యుమెంటరీలు తీయడానికి సాహసించడంలేదు. డాక్యుమెంటరీలకు డబ్బు రాదని మన నిర్మాతల నమ్మకం.

* * *

రేవతి—బనివికల్ (బళ్ళారి)

త్రీ-డీ చిత్రాలు టెక్నికలర్లో తీస్తున్నారుకదా ప్రేక్షకులకి "పోలరైజ్డ్"



"స్నోస్ ఆఫ్ కిలిమంజారో"లో హిల్డ్ గార్డ్ నెఫ్, గ్రెగరీ పెక్.

కళ్ళజోడులో టెక్నికలర్ రంగు లెలా కనబడుతూవుండి?

—'పోలరైజ్‌డ్' కళ్ళజోడు అద్దాలు చూడడానికి మామూలు కళ్ళజోడువలెనే వుంటాయి వాటిలోంచి అన్ని రంగులూ కనిపిస్తాయి

* * *

శ్రీ కె పురుషోత్తం—కరకంబాడి.

ఆంధ్రదేశమంతటా ప్రజల సుఖ్యాతి లూగించుచున్న వినోదావారి తెలుగు "దేవదాసు" చిత్రమును మదరాసులో రిలీజు చేయకుండా యుండడానికి కారణం? తెలుగువారికి మంచిపేరు వస్తుందనా?

—వినోదావారు "దేవదాసు" అరవంలో కూడా నిర్మిస్తున్నారు గనుక మదరాసులో ఒకాలూ తమిళ చిత్రం విడుదలచేస్తారు

* * *

శ్రీ కె మారుతిరామిరెడ్డి—చీరాల

ఒక చిత్రంలో ఆయా ఘట్టాలలోని అసభ్యతను తొలగించడంతోనే సెన్సారు వారి బాధ్యత పూర్తవుతుందా, లేక ఆ చిత్రం నిడివిమీదకూడ వారికేమైనా అధికారముందా ?

—చిత్రం నిడివిమీద సెన్సార్లకేమీ అధికారంలేదు

* * *

శ్రీ సి ఆర్ ప్రసాద్—ఒంగోలు

మద్రాసురాష్ట్ర సినిమా రంగములో తెలుగువారి చిత్రాలు ఖ్యాతి గాంచినవా? లేక తమిళుల చిత్రాలు ఖ్యాతి గాంచినవా?

—తమిళ-చిత్రాలకంటె తెలుగు-చిత్రాలే చాలా విషయాల్లో మెరుగుగా కనిపిస్తాయి తెలుగు-చిత్రాలు, తమిళంనుండి తెలుగులోకి తర్జుమా చేయబడిన చిత్రాలూ పోల్చిచూస్తే ఈ తేడా తెలుస్తుంది తెలుగు చిత్రాలు బాగుంటాయని తమిళులే అంటున్నారు

* * *

శ్రీమతి జి కమల—రాజమండ్రి

"జనగణమన" గీతాన్ని టాగూర్ ఐదవ జార్జి మనదేశానికి వచ్చినపుడు స్వాగత గీతంగా దాన్ని రాసి పాడారుకదా, అట్టి గీతాన్ని మన ప్రభుత్వం జాతీయగీతంగా ఎట్లు గుర్తించింది ?

—ఆ గీతం ఐదవజార్జికి స్వాగతగీతమని మీకెలా తెలిసింది? అది కేవలం దేశభక్తి ప్రేరితమైన గీతం కనుకనే మనజాతీయగీతంగా ఎన్నుకోబడింది

* * *

శ్రీ శింగులూరి మధుసూదనరావు—కొండపల్లి

చలన-చిత్ర పరిశ్రమలో ప్రఖ్యాత నటీనటులు చిత్రనిర్మాతలుగా మారడము, పరిశ్రమకు మేలు చేకూరుస్తుందని మీరు నమ్ముదురా?

—నిర్మాత వ్యవహారదక్షత గలవాడై వుండాలి నటీనటులకు వ్యవహారదక్షత వుంటే వారు నిర్మాతలు కావడంలో తప్పులేదు.

* * *

శ్రీ దుర్గం సాయన్న—సికింద్రాబాద్.

షోమన్‌షిప్ అనగా నేమి?

—సినిమాల్లో కొన్ని ఆడంబరంగా ఉంటాయి, కొన్ని నిరాడంబరంగా ఉంటాయి ఆడంబరం, పటాటోపంతో కూడిన సినిమాలు తీసేవారికి 'షోమన్‌షిప్' ఉన్నదంటాము హాలీవుడ్ నిర్మాత సెసిల్ బి డెమిల్ చిత్రాల్లో షోమన్‌షిప్ ఉంటుంది బ్రహ్మాండమైన సెట్టింగులు, విలువైన దుస్తులు, బోలెడుమంది నటీనటులు, పెద్ద ఇతిహాసంలాటి కథా—ఇలాటివన్నీ ప్రేక్షకులకు ఆకర్షణలుగా పనిచేస్తాయి శామ్సన్ ఎండ్ డెలీలా, కో-వాడిస్ లాంటి చిత్రాల్లో షోమన్‌షిప్ కనిపిస్తుంది ఈ చిత్రాలకు చాలా డబ్బు ఖర్చు కావడమే కాక, ఆ ఖర్చుకు తగిన పనితనం కూడా కనిపిస్తుంది 



అదే చిత్రంలో గ్రెగరీపెక్, ఆవా గార్డ్‌నర్.



'ముందు బయటకి న'
మద్రాస్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి "రోహిణి"లో లంక సత్యం, కె రామస్వామి

# ★ సినిమా వార్తలు ★

రాజ్యలక్ష్మీ ప్రొడక్షన్స్ అనే సంస్థవారు "సినిమా" అనే సాంఘిక చిత్రం తీస్తున్నారు ఇది హాస్య చిత్రమనీ, నాలుగు రీళ్ళవరకూ తయారైనదనీ తెలుస్తోంది శ్రీపట్టాభిరామారావు గారు దర్శకుడు, మల్లిక్ సంగీతదర్శకుడు మాటలు పాటలు పరశురాం విద్యావతి, శోభ మొదలైనవారు నటిస్తున్నారట స్టార్ కంబైన్సులో షూటింగ్

* * *

ఈస్టిండియావారి "పక్కింటిఅమ్మాయి" కలకత్తాలో నిర్మించబడుతోంది ఇదికూడా సాంఘిక హాస్య చిత్రమట అంజలీదేవి, రేలంగి మున్నగువారు నటిస్తున్నారు శ్రీ సి పుల్లయ్యదర్శకుడు

* * *

రోహిణీ పిక్చర్సువారు ఏకకాలంలో మూడుచిత్రాలు నిర్మిస్తున్నారు వీరి మొదటి చిత్రం "ప్రతిజ్ఞ" తుదిఘట్టంలో పడిందనీ, క్లైమాక్సుదృశ్యాలు ఇటీవల షూట్ చేశారనీ తెలుస్తున్నది శ్రీ వై ఆర్ స్వామి దర్శకుడు సావిత్రి, గిరిజ, కాంతారావు, రాజనాల మున్నగువారు నటిస్తున్నారు ఇదిగాక "బీదల ఆస్తి", ప్రొడక్షన్ నెం 9 అనే చిత్రాలుకూడా రోహిణీవారు నిర్మిస్తున్నారు

సెప్టెంబరునుండి మొదలు పెట్టి మొదట "ప్రతిజ్ఞ", తరవాత ప్రొడక్షన్ నెం 9, తరవాత "బీదల ఆస్తి" వరసగా విడుదల చేయ సంకల్పించామని రోహిణీ అధిపతి శ్రీ హెచ్. ఎమ్ రెడ్డి తెలుపుతున్నారు

* * *

న్యూథియేటర్స్‌వారు నిర్మిస్తున్న హిందీ "నయాసాఫర్" (బెంగాలీలో "నబీన్ జాత్రా") ఈనెలలో విడుదలవుతుందట మనోజ్ బోస్ వ్రాసినకథ ఆధారంగాగల ఈ చిత్రం సుబోమిత్ర ("డాక్టర్") దర్శకత్వాన తయారైనది విద్య, వ్యాయామం అనే విషయాలను చిత్రిస్తూ, మానవుడు పరిస్థితులకు బానిస కాగూడదనీ, పరిస్థితులనే తన బానిస చేసుకోగల శక్తి మానవుని కున్నదనీ ఈ చిత్రం నిరూపిస్తుందట వసంత్ చౌదరి ('యాత్రిక్'), మాయాముఖర్జీ, దేవబాల, తులసి, ప్రేమ్ కుమార్, ఆనంద్ కుమార్, రేఖా మున్నగువారు నటించారు పంకజ్ మల్లిక్ సంగీతం సమకూర్చాడు

* * *

ఎ జె పటేల్ అనే ఆయన ఇండియాకు మొట్టమొదటదైన త్రీ - డీ కామెరాను నిర్మించాడట దీని ఖరీదు యాభైవేల రూపాయలట



ఎమ్ ఆర్. ఏ. వారి "లేడీడక్టరు' లో కృష్ణవేణి, విజయకుమార్.

నిర్మాత, నటుడు, డైరెక్టరు ఎస్ డి నారంగ్ "డాకర్ ఎక్స్" అనే భయానక కథాచిత్రాన్ని త్రీ-డీ టెక్నిక్‌లో తీస్తున్నానని ప్రకటించాడు పైశాచిక కృత్యాలుచేసే ఒక డాక్టరూ, ఒక నటి ప్రధాన పాత్రలట దీని నిర్మాణం నిర్విఘ్నంగా సాగితే ఇది ఇండియాకు మొదట త్రీ - డీ చిత్రం అవుతుంది ప్రహ్లాద్ దత్ అనే ఆయన స్వయంగా త్రీ-డీ కామెరా నిర్మించి ఈ చిత్రం నిర్మాణంలో పాల్గొంటున్నాడు బొంబాయి ఎమ్ ఎండ్ టి స్టూడియోలో షూటింగ్ జరుగుతుందట నిరూపరాయ్, స్మృతిబిశ్వాస్, హీరాలాల్, సుందర్, నారంగ్ మున్నగువారు నటీనటులు

* * *

" నిర్మాత కె ఎ అబ్బాస్ హిందీ, ఇంగ్లీషులలో "రాహి" అనే చిత్రం ఇటీవలే పూర్తిచేశాడు తేయాకు తోటల కార్మికుల జీవితాలను చూపించే ఈ చిత్రంలో దేవానంద్, నళినీ జయవంత్, డేవిడ్ మున్నగువారు నటించారు

* * *

హాలీవుడ్ ఎమ్ జి ఎమ్ వారు తాము వచ్చే 18 నెలల్లో 34 చిత్రాలు సినిమాస్కోప్ టెక్నిక్‌లో నిర్మించనున్నట్లు ప్రకటించారు ఈ చిత్రాలు ఏ రకం తెరకయినా పనికివచ్చేటట్లు నిర్మిస్తున్నారు ఈ కంపెనీవారు బొంబాయి, కలకత్తా నగరాల్లోని మెట్రో థియేటర్లలో విశాలమైన తెరలు ఏర్పాటు చేస్తున్నారు అక్కడ ముందుగా "క్వోవాడిస్" చిత్రాన్ని ప్రదర్శిస్తారట ఆ తర్వాత వరసగా కొన్ని త్రీ - డీ చిత్రాలు, సినిమాస్కోప్ చిత్రాలు ప్రదర్శిస్తారట

★

## ఆలిండియా రేడియోవారి కొత్త ఎక్స్పెరిమెంట్

(47 వ పేజీ తరువాయి)

తిరిగి భూతలానికి రావడం—ఇదంతా వస్తువుగా తీసుకొని ఈ సింఫొనీ రచించబడింది ఇది సుమారు 15 నిమిషాలసేపు నడుస్తుంది దీన్ని అక్టోబరు ప్రాంతాల్లో బ్రాడ్‌కాస్ట్ చేస్తారని తెలుస్తున్నది ★

(4 వ పేజీ తరువాయి)

లేదు. అయిదు రూపాయిలు ఇస్తే అందమైన రూపంలో ప్రతి ఆసామీకి ఫొటో వస్తుంది. సుబ్బారావు అనే కుర్రవాడు యిటీవల మెద్రాస్ వెళ్ళివచ్చాడు. అతను యీ చిత్రవాడలో చాలామంది తీయించుకున్న ఫొటోలన్నీ చూచాడు. కాని తాను మెద్రాస్‌లో ఎంత డబ్బయినా ఖర్చుచేసి, కొత్త ఫొటోగ్రాఫ్ యంత్రాలతో కొత్త రకం ఫొటో తీయించుకోవలెనని శపథం చేశాడు. మెద్రాస్‌కు వెళ్లేటప్పుడు రైలులో ఒక ప్రయాణికుడు యింకొక ప్రయాణికునితో మాట్లాడుతూ సందర్భవశంగా తాను మెద్రాస్‌లో ఎక్స్‌రేఫొటో తీయించుకోవలసియున్నదనిన్నీ అందుకు రమారమి రూ 20 లు ఖర్చు అవుతుందనిన్నీ చెప్పాడు. ఆ రైలు ప్రయాణంలో ఈ మాటలు సుబ్బారావు విన్నాడు. మెద్రాస్ వెళ్ళగానే ఒక ఫొటోగ్రాఫరు షాపుకు వెళ్ళి తనకు యక్స్‌రేఫొటో తీయవలెనని అడిగాడు. కాని, సదరు యక్స్‌రే ఫొటోలు తన షాపులో తీయబడవనిన్నీ, మ.రొకచోట తీయబడుననిన్నీ చెప్పి సదరు అడ్రెసును సుబ్బారావుకు వ్రాసియిచ్చాడు. సుబ్బారావు అతడు చెప్పిన అడ్రెసుకు వెళ్లి. రమారమి రూ. 20 చెల్లించి నడుమువరకు తన యక్స్‌రే ఫొటో తీయించాడు. రెండు రోజుల్లో ఫొటో తయారవుతుందని ఫొటో తీసిన మనిషి చెప్పాడు. ఇంతలో "సుబ్బారావు తనతండ్రి యిచ్చిన టెలిగ్రాం చూచుకొని అర్జంటుగా చిత్రవాడకు రావలసివచ్చింది. అందువల్ల సదరుఫొటోను చిత్రవాడకు పోస్టులో పంపవలసినదిగా తన చిత్రవాడ అడ్రెసు యిచ్చాడు - చిత్రవాడకు సుబ్బారావు చేరిన తర్వాత తాను మెద్రాస్‌లో తీయించుకున్న ఫొటోచూస్తే చిత్రవాడలోని వాళ్ళందరూ హడలిపోతారనిన్నీ, అది మామూలుగా వేలం వెర్రిగా అందరూ తీయించుకునే వెర్రిపుల్లాయి ఫొటోల వంటిది కాదనిన్నీ ఒక్క ఫొటోకు 20 రూపాయలు అయిందనిన్నీ ఊళ్లో అందరి ముందర తన యక్స్‌రే గొప్ప చెప్పుకొని చాటించుకొన్నాడు. ఊళ్లో ఉన్న పెద్ద ఆసాముల యిండ్లలోని వడుచువాళ్ళకు అందరికీ స్త్రీలకు పురుషులకు కూడా సుబ్బారావు తీయించుకొన్న హెచ్చు కిమ్మతు ఫొటోవంటి ఫొటో తీయించుకోవలెననే కుతూహలం ప్రబలమైంది. ఇంతలో సుబ్బారావు తాలూకు యక్స్‌రేఫొటో పోస్టులో వచ్చింది. ఆ ఫొటో వచ్చిందనే సంగతి తెలియగానే జనం అతనిచుట్టూ చేరారు. ఫొటో పైకి తీసేసరికి ఆ యక్స్‌రే ఫొటోలో సుబ్బారావుయొక్క అస్థిపంజరం (ఎముకలగూడు) మాత్రం స్పష్టంగా పెనుభూతంలాగున కన్పిస్తోంది. నిజంగా సుబ్బారావు చెప్పినట్లుగానే ఊళ్లోవాళ్ళందరూ ఆ ఫొటోను చూచి హడలిపోయినారు. "ఇదేమిటోయి! సుబ్బారావు! ఇదేనా నీ నిజస్వరూపం?" అని ఒక తాతగారు ఆ ఫొటో చూచి ప్రశ్నించారు. చిత్రవాడలోని ఫొటోగ్రాఫరు ఆ మాట విని "యిదేనండీ మన నిజస్వరూపం అయిన ఫొటో! మన శరీరంలో వుండే అసలైన సుస్థిరమైన అస్థిచట్రం. అందుకు సందేహం లేదు"అన్నాడు.

ఒక డాక్టరు ఆ ఫొటోను చూచి యీ ఫొటో చాలా బాగాఉంది అన్నాడు. సుబ్బారావు ముక్కువద్ద ఒక ఎముక లోపలి భాగంలో వంపుతిరిగి ఉన్నదనిన్నీ, అందువల్లనే అతనికి తరచు శ్వాసబాగా ఆడక మొండిశిరోభారం విడువకుండా ఉంటున్నదనిన్నీ చెప్పాడు. ఆయెముకను సరిచేయిస్తే అతనికి ఆబాధ పోతుందన్నాడు. తర్వాత మరుసటిసంవత్సరం ఆప్రకారంగా పెద్ద డాక్టరుచేత సరిచేయించిన పిమ్మట అతని శ్వాసబాధ పోయింది.

యక్స్‌రే ఫొటోలో సుబ్బారావుయొక్క నిజస్వరూపం (అంతర్గతమైన స్వరూపం) స్పష్టంగా కన్పించింది. కాని, అందులో మాంసంలేని ఎముకలు కన్పిస్తున్నాయి. అది "నిరామిషంబు" (మాంసం లేనిది) "అంగభవంబగు నెమ్మి" అతని శరీరములోని ఎముకలే అందులో ఉన్నాయి. చూచినవారికందరికీ ఆఫొటో అసహ్యంగా ఉంది. "కేవలనింద్యము" అనిపిస్తోంది. "హేయము"గా ఉంది. అయితేనేం? అదే అతని శరీరముయొక్క "నిజ స్వభావ" స్వరూపమును చూపించింది. తన నిజ స్వరూపమును సుబ్బారావు చూడగల్గినందువల్ల అతని ఆరోగ్యం బాగుపడింది. కనుక నిజస్వరూపమును చూచి సిగ్గుజెందవలసిన పనిలేదు. "నిజ స్వభావమును తెలిసికొనడం సులభమైన అల్పమైన విషయం కాదు. తన నిజతత్వమును తాను తెలిసికొనడంఅనేది ఉత్తమప్రాణియొక్క లక్షణం. కనుక, తన నిజస్వభావమును తెలిసికొన్నప్పుడు సిగ్గుజెందవలసిన అవసరం లేదు. ఆత్మతత్వమును నిజస్వభావమును గ్రహించినప్పుడు నీచప్రాణి సిగ్గుపడునేమోగానిఉత్తమప్రాణి సిగ్గుపడదు.

ఊళ్లోవాళ్ళు తాము తీయించుకొన్న ఫొటోలలో దేవేంద్రులవలె ఉన్నారు. కాని సుబ్బారావు తన ఫొటోలో తన నిజస్వరూపం చూచాడు. ఆ యింద్రమహేంద్రజాలంవంటి బడాయి ఫొటోలతో తన నిజస్వరూప చిత్రమును పోల్చి చూచుకొని సుబ్బారావు యిసుమంతైనా సిగ్గుపడలేదు. మీదు మిక్కిలి ఆత్మజ్ఞానం, ఆరోగ్యం పొందగలిగాడు.

కనుక, "కేవల నింద్యము" "నిరామిషంబును" "అంగభవంబగు నెమ్మి" యీ స్వకీయాస్థి విగ్రహమని గ్రహించిన సుబ్బారావు - "సురనాథుని" పోలిన ఫొటోలగన్గొని సిగ్గుజెందలేదు. "......సిగ్గుజెందక దల్పమని నిజస్వభావము దలంపదు ఉత్తమప్రాణి యెయ్యెడన్." ★

పిల్లల గేయకథల సంపుటి:—రచయిత శ్రీ కవిరావు; చిత్రలేఖకుడు శ్రీ జి. వి. సుబ్బారావు; సంపాదకుడు శ్రీ ముమ్మనేని చలపతిరావు; ప్రచురణ, తెలుగు బాల రచయితలసంఘం, బాపట్ల; ప్రతులకు, సాహితీకేంద్రము, తెనాలి, రేపల్లె; వెల 1-8-0; సాదా ప్రతి వెల 1-0-0

మొత్తం 24 గేయకథలతో, లిఖిత చిత్రాలతో, అందమైన బైండింగు, ముద్రణలతో సర్వాంగసుందరంగా వెలువడిన "బొమ్మరిల్లు" అనే ఈచిన్న గ్రంథం బాలబాలికలకు ఎంతో ఆకర్షకంగా వుంటుందనడానికి సందేహం లేదు. ఈగేయాల్లో సగానికి పైగా ఆంధ్ర వారపత్రికల్లో బొమ్మరిల్లు శాఖక్రింద లోగడ ప్రచురింపబడినవి. మిగతావి తదితర పత్రికలలో ప్రచురితాలైనవి. సామాన్యంగా అందరికీ తెలిసిన సామెతలను, నీతికథలను తీసుకొని, పిల్లలకు వెంటనే గ్రాహ్యమయ్యే సులభ శైలిలో కవిరావుగారు ఈ గేయాలు వ్రాశారు. కథలు చాలవరకు అందరికీ తెలిసినవే అయినా వ్రాయడంలో కొత్తదనం, సున్నితమైన హాస్యం ఉండడంవల్ల ఎన్నిసార్లయినా చదువుకుని ఆనందించతగినవిగా వున్నాయి. ఇంట్లో తమంతటతాము చిన్న చిన్న లైబ్రరీలు సమకూర్చుకునే బాలబాలికలు ముచ్చటైన ఈ పుస్తకం కొనుక్కొని ఉంచుకుంటే అదో అలంకారంగా వుంటుంది.

ప్రత్యేకం పిల్లలకని ఉద్దేశించబడిన పుస్తకాలు, ఆకర్షకంగా ముద్రించబడినవి ఇంగ్లీషులో కొల్లలుగా వున్నాయి. తెలుగులో అటువంటి పుస్తకాలను వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. ఈ పుస్తకం ప్రచురణ ఇటువంటి అనేక పుస్తకాల ప్రచురణకు దారి తీస్తుందని ఆశిస్తున్నాము. ★

# ★ కాళరాత్రి ★

(11-వ పేజీ తరువాయి)

కంటే సత్యాంతరం లేదనే నిర్ణయానికి రావచ్చు. అలా నిర్ణయానికి వచ్చినవారు, శిక్షలకీ శాసనాలకీ అసలే భయపడరు... తాము పట్టుబడమనే నమ్మకం వుంటే, ఆ నిర్ణయాన్ని కడంటూ కొనసాగించవచ్చు కూడానూ.

మో : అంతకంటే ఎక్కువ నమ్మకంతో మర్డరు చేసినవాళ్లే పప్పులో కాలేశారు.

నర : ఎందుకు వేస్తారు — వాళ్ళు దగ్గిర పెట్టుకు పనిచేస్తే?

మో : ఏ కేసైనా తీసుకు చూడు - ప్రతి కేసులోనూ హంతకుడు దొరికిపోతాడు! ఎందుకని?...వాడు కూడా మనిషే గనక! ఏదో ఒక చిన్న పొరపాటు - ఏ జేబురుమాలో ఏ సిగరెట్టో సాక్ష్యంగా వదిలేసి పోవడం సహజం గనక!

రామా : నే నెప్పుడూ కూడా సాక్ష్యాల జోలికి పోను! తెలుసుకోవలసింది అసలు కారణం! జరిగిన హత్యకి కారణమేమిటో తెలుసుకుంటే- దొరికిపోతాడు హంతకుడు!

[ఉరుములు - మెరుపులు - వాన సాగిన చప్పుడు——]

సుకు : ఓహ్ - అసలే గుండెలు దడదడలాడుతున్నై, ఈ ఉరుముల్లోనూ మెరుపుల్లోనూ. ఆపండయ్యా బాబూ కాస్సేపు హత్యల గొడవ.

[ఉన్నట్టుండి ఇంటి వెలుపలనుంచి వికృతమైన ఆర్తనాదం వినిపిస్తుంది. అంతా ఉలిక్కిపడతారు. వెంటనే రివాల్వరు పేలిన శబ్దం - అంతా భయాకులితులై లేచి నిలబడతారు. రాజా వరండా వాకిలిలోంచి తాపీగా చేతిలో పిస్టలుతో ఆడుకుంటూ వస్తాడు.]

సుకు : ఏ - ఏమిటది?

నర : రివాల్వరు పేలిన చప్పుడయింది?

రాజా : రివాల్వరా?...ఓ!...ఇదే - ఇది పేలిన చప్పుడే అయివుంటుంది!

(రామానుజం దగ్గరకొచ్చి) ముప్పై రెండు కాలిబర్ - చిన్నదైతే అందిగాని నూం - భీ ఎఫెక్టివ్ - సద్యః ఫలితం!

కమల : ఎవరో స్త్రీ కేక పెట్టారు?

రాజా : ఓ - అదా! అది నారాయణ ఆర్తనాదమై వుంటుంది.

అంతా : నారాయణా?

కమల : వాడా?

రాజా : అవును.

కమల : (అడగడానికి ధైర్యం చాలక అడగలేక అడుగుతూ) ఎందుకు - ఎందుకూ అలా కేక పెట్టాడు?

రాజా : చావడాని కిష్టం లేక.

కమల }
సుకు } : ఓహ్——

నర : ఏమిటీ - ఏం జరిగిం దసలు?

రాజా : ఏముందీ - ఇదిగో - ఈ రివాల్వరుతో నే కాల్చి చంపేశానూ!

[కమల వస్తున్న వెర్రికేక నతి కష్టంమీద ఆపుకుంటుంది. అందర్నీ ఆశ్చర్యం, భయం ఆవహిస్తాయి.]

రామా : గుడ్ గాడ్! మిస్టర్ రాజారావ్.

కమల : నిజంగానా - నిజమేనా అయనేది?

రామా : ఆఁ ఏమీ లేదు! ఆడుతున్నాడు వేళాకోళం!

నర : అబ్బ - నిజంగా హడలగొట్టావోయ్ అందర్నీనూ!...ఏడీ నారాయణ?

రాజా : కిటికీలోంచి కాస్త తొంగి చూస్తే కనిపిస్తాడు. నది ఒడ్డున చచ్చిపడి వున్న నారాయణ ఇక్కడికి కెలా కనిపిస్తాడు?

[నరహరి కిటికీదగ్గరకు వెళ్లి బయటకు చూస్తూండగా ఉరుములు - మెరుపులు. జోరున వర్షం - గాలి వీస్తూంటుంది- గదిలో అంతా ఊపిరి బిగబట్టి నిరీక్షిస్తూంటారు. రాజా అందరివంకా వెటకారంగా చూస్తూంటాడు. నరహరి ఉలిక్కిపడి, సౌంజ్ఞచేయగా రామానుజం కూడా వెళ్లి చూస్తాడు.]

మో : ఏమిటది?

సుకు : నే చెప్పలే ఏదో కొంప మునుగుతుందని?

రామా : కనిపిస్తోంది నీళ్లవారే మానవ కళేబరం ఒకటి!

నర : నారాయణే!...సందేహం లేదు.

కమల : (సోఫాలో కూలబడుతుంది).

సుకు : అంతా అలా నిలబడతారేం కొయ్యబొమ్మల్లాగా? ఏమన్నా చెయ్యండయ్యా బాబూ ఎవరన్నా!

రామా : (వరండావాకిలికేసి పోబోతూ) వెళ్ళివద్దాం రండి నరహరిగారూ మనం అక్కడికి. ప్రథమ చికిత్స కూడా వచ్చు నాక్కాస్త.

నర : (కిటికీలోంచి చూస్తూ) లాభం లేదు. పెద్దఅల వచ్చి లోపలికి లాగేసింది. అదుగో కొట్టుకుపోతున్నాడు.

రామా : వున్నదిగా లాంచీ. అందులో పోయి అతన్ని తెద్దాం రండి.

రాజా : (అడ్డం వస్తూ) ఆగండి ఒక్క క్షణం రామానుజంగారూ! (రివాల్వరు అతనికి గురిపెట్టి) ఎక్కడి వాళ్ళక్కడే గప్‌చిప్! మీరింక నారాయణకు చెయ్యగలిగిందేమీ లేదు. అతను చచ్చిపోయాడు!

కమల : నువ్వే చంపావ్!

[నరహరి వాకిలికేసి వెళ్ళబోతాడు.]

రాజా : (రివాల్వరు అతనివైపు తిప్పి) వద్దు నరహరీ!......కాలు కదపటం అంత మంచిది కాదు.

[నరహరి వెనక్కి తగ్గుతాడు]

రాజా : దయచేసి అందరూ ఆ గోడదగ్గరకు వెళ్లి చేతులెత్తి నిలబడండి. ఊఁ——! హుఁ——మీ రెత్తు ధనం పోసినా కూడా హత్యాకాండ కళ్ళారా చూసే అవకాశం వస్తే వదులుకోరుగదూ! శ్రమపెట్టి మిమ్మల్నందర్నీ ఇక్కడికు లాక్కొచ్చినందుకు, మీ అభిరుచి గ్రహించుకుని చంద్రుడికో నూలుపోగన్నట్టు ఒక్క హత్యమాత్రం చెయ్యగలిగాను. దాంతో సంతోషపడండి. ఏదీ——మీ మందహాస భాసుర వదనారవిందాలు నా కన్నులపండువగా కనిపించేటట్లు నిలబడండి——

[అంతా భయంతో ఒకరినొకరు చూచుకుంటారు.]

రామా : రాజారావుగారూ——!

రాజా : తమరు నోరు ముయ్యండి రామానుజంగారూ ముందు...మీరూ మీ భట్రాజులూ వచ్చినదగ్గరనుంచీ హత్యలూ హంతకుల్ని గురించేగా మాట్లాడుకోవడం! ఇదుగో - ఇప్పుడు నిజమైన [illegible] కూర్చుంది మీముందు. ఎలా వుంది? ఏం చేస్తారు మరి మీరు దీన్ని గురించి? వెళ్ళిపోయిన లాంచీ మళ్ళీ వచ్చేదాకా, మనందరి కాళ్ళకీ ఈ లంకలో సంకెళ్ళే! రివాల్వరు కూడా నా ఒక్కడిదగ్గరే వుంది. ఎవరైనా కొత్త అతితెలివి చూపించబోయారా—— కబురు చెప్పడానిక్కూడా ఎవరూ మిగలరు....ఇవ్వాళ రాత్రి నే నొక మహోద్భుత రహస్యం కనిపెట్టాను - మానవ ప్రాణాలు తియ్యడమంత చులకనైన పని మరొకటి లేదు!

సుకు : పిచ్చెక్కిపోయి వాగుతున్నాడు!

రామా : అరె - పేలిపోతుం దేమోనయ్యా బాబూ అది!

రాజా : మరేం భయపడక్కర్లేదు రామానుజం! ఇవ్వాల్టికి నా ఆకలి చల్లారింది. (మెట్లకేసి వెళ్తూ) ఒళ్లు దగ్గిరపెట్టుకుని సంచరిస్తే, లాంచీ మళ్ళీ వచ్చేదాకా మీకేం ఫరవాలేదు.

రామా : అది వచ్చింతర్వాత?

రాజా : మిమ్మల్నందర్నీ ఇక్కడే స్వేచ్ఛగా వదిలేసి, ఆ లాంచీయెక్కి నే



# రాగముక్త



(19-వ పేజీ తరువాయి)

బతికి బయట పడతానో లేదో - చెప్తున్నాను. ఈ అన్యాయానికి నేనేం కారణం కాదు. నన్ను నమ్మతావు కదూ? నన్ను క్షమించవు కదూ'

సత్యవతికి ఇదేమీ బోధపడలేదు కాని - కళ్ళంట నీళ్ళు తిరిగేయి. రెండు నెలలు పైగా మాట్లాడుకోకుండా ఒక యింట్లో గడిపిన అనుబంధానికే ఆమె మనసు అదోలా అయింది.

'పసుపు కొమ్ము ఉందే! పుస్తెకూడా అమ్మేశారా?' అంది రవణ.

సత్యవతి సమాధానం చెప్పలేదు. రైలు కదిలింది. రవణ తన మెళ్ళో బంగారు మంగళసూత్రం తడివి చూసుకుంది. ఆమె మెళ్లో పసుపుకొమ్ముకంటె నా మెడలో బంగారు తాళి ధర్మసమ్మతమైనదా? నిజమైన ప్రేమబంధాన్ని నిరూపించేదేనా! ఇది?' అనుకుంది.

రాజు అడిగాడు. సత్యవతి పుట్టింటికి పోయిందని చెప్పింది రవణ. రాజు విచారించలేదు త్వరలో నే తనమీద విడాకులకు దావాపడుతుందని ఆశతో వున్నాడుకూడా.

మద్రాసు ఆస్పత్రిలో నే పురుడు పోయించుకోవాలని రవణ తండ్రిదగ్గరికి వెళ్లనంది. నెలలు నిండేక తండ్రీ అక్కా వచ్చి ఇక్కడే వుండిచేతనైన ధనసహాయం చేస్తోవచ్చారు-రవణ ఒక మగ పిల్లవాణ్ణి కన్నది - రాజూ రవణా పొంగిపోయారు.

నాల్గునెలలు పోయేసరికి రవణ మామూలు మనిషి అయింది. అదృష్టం కొద్దీ ఇద్దరికీ మంచి కంపెనీల్లో స్థిరమైన ఉద్యోగాలు దొరికాయి. పిల్లవాడి అదృష్టం అనుకున్నారు అంతా-

“బతుకుతానా అని ఎంతభయపడ్డా ననుకున్నావురాజూ” అనేదిరవణ.

ఆదాయంకూడా బాగానే వుండిప్పుడు. నారాయణ తరుచువస్తోండేవాడు. అతన్ని చూస్తే చాలు వెంకటేశ్వర్లు జ్ఞాపకానికి వచ్చి ఒకరోజల్లా అస్వస్థతులతో బాధపడేది రవణ-రాజుతో తన వివాహం తనకేదో స్థిరత్వం కల్పించిందన్న భావం ఆమెకి మిన్నగాతోస్తోంది, సత్యవతినిగురించి తల్చుకుంటే. కొత్తలో తమప్రేమ, తామనుభవించిన కష్టాలు, వీటితోపాటు వెంకటేశ్వర్లు-వీటన్నిటితోనూ ఆమె మనసులోనే కలతపడేది. —నిరాశ ఆమెలో మూర్తీభవించింది. రాజంటే నిరాదరణలేదుగాని— బిడ్డమీదే ఆమె ప్రేమంతా కేంద్రీకృతమైపోయిందిప్పుడు. జీవితమే ఇంతేనేమో! బతుకంతా “రొటీన్”లో పడిపోడానికి— మామూలు పెళ్ళి; ప్రేమవివాహం అనే భేదంలేదేమో! ఉద్యోగం, పిల్లవాణ్ణి ముద్దాడ్డం వీటిలోనే ఆమెకాలం గడిచిపోతోంది. ఇంకా తీరికమిగిలితే ఆలోచన. పగలంతా ఆఫీసులో పనిచేసివచ్చి బాబీ నిద్రపోతున్నా సరే. 'కళ్ళుకాయలు కాసిపోయాయినాన్నా'— అంటూ లేపేసి ముద్దులాడేది.

రవణకి ఒకే ఒక తెగనిఆలోచన. అది తన స్థానం ఏమిటని. అక్క అన్నమాట మరపురావటంలేదు. అసలు తనింత సుఖంగా ఉన్నా ఏదో అరుదుగా నేవుంది, దిగులుగా. ఈ పరిస్థితికి విరుగుడేమిటో తోచడంలేదు. కాని ఈ అరుదు తను శాశ్వతంగా భరించలేదు. తన నరాలు ఈ బెదురు సహించలేవు. ఎప్పుడో తను కుప్పలా కూలబడిపోతుంది. అందుకనే పెద్దపులి ఉన్నదన్నప్పుడు బతుకంతా ఎలా శాంతిగా గడపడం? రాజు తనంటే ఎంతో ప్రేమగా ఉన్నా తనకి కుదురులేదు. ఏంచేస్తే శాంతి లభిస్తుంది? అసలీ అశాంతికి ఎవరు కారణం? వెంకటేశ్వర్లుతో తనకివిడిపోయినప్పుడు— అతనిదేతప్పు, అతనే కారణం దానికంతకీ అని సులభంగానే నిర్ధారించి శాంతి కూర్చుకుంది. కాని ఇప్పుడు ఈ ఆవేదన తనకి నిద్రలేకుండా చేస్తోంది, తనలో ఈ తుఫాను రాజు గ్రహించకపోలేదు, కాని ఇది చర్చించే విషయంకాదు.

## 5

ఎనిమిదోనెల వచ్చింది పిల్లవాడికి. రవణకి పిల్లవాడు, ఉద్యోగం, ఆలోచనతప్ప వేరే కాలక్షేపంలేదు. బరువై తన మనసు కలచివేసే ఆలోచనలనుంచి తప్పుకుందామని చూస్తుంది. కాని ఆ క్షణానికి సత్యవతో, అక్కమాటలో, వెంకటేశ్వర్లో జ్ఞాపకానికి వచ్చి కలతపడేది. ఒకనాడు పిల్లవాడికి జ్వరంవచ్చింది. రవణ ఆరోజు ఆఫీసుకు పోలేదు. మంచంవద్దనే కనిపెట్టుకూర్చుంది. మూసినకన్ను తెరవకుండా పడివున్నాడు బాబీ. రాజునిమాత్రం తనే బలవంతంచేసి ఆఫీసుకిపంపింది. అలా జ్వరంతో ఉన్న బాబీనిచూస్తే ఎన్నో ఆలోచనలువచ్చాయి. పెద్దవాడైతే తనని గురించి ఏమనుకుంటాడు? అసలు బాబీ పుట్టకపోతే తన బతుకెలావుండేది? బాబీ లేకపోతే తనకి ఆనందకిరణమే లేదేమో! తన సర్వస్వమూవీడే! కాని కడుపున పడగానే వాణ్ణి ఎంతగా అసహ్యించుకుంది! ఇప్పుడనుకుంటోంది. తను కొంతయినా ఉల్లాసంగా ఉండగల్గుతోందంటే వాడి బోసినవ్వే కారణం అని—తనకి అండగా నిలబడతాడు, అనుకుంటూ ప్రేమకొద్దీ ముద్దుపెట్టుకుంది. కన్ను తెరవకుండానే బోసిగా నవ్వేడు.

మర్నాడుకూడా జ్వరం తగ్గలేదు. డాక్టరుమందిస్తూనే వున్నాడు. రాజుకూడా ఆఫీసునిమాని బాబీదగ్గరే కూర్చున్నాడు. ఆ ఆందోళనలో భార్యాభర్త లిరువురిలోనూ ఏదో ఆ వ్యక్తసామ్యం రూపించింది.

“నాకేమిటో భయంగా వుందిరాజూ” అంది రవణ.

రాజు ఊరడించాడు. రాత్రి పన్నెండయ్యేసరికి రవణకి కొద్దిగా కునుకుపట్టింది. రాజుకి మెలుకువవచ్చిచూస్తేరవణపక్కలో ఉన్న పిల్లవాడికివొళ్ళుచల్లబడిపోయిఉంది. దుఃఖం పెల్లుబికివచ్చింది రాజుకి. పాపం రవణ ఆ పిల్లవాణ్ణి పక్కలోవేసుకుని ఎలా నిద్రపోతోందో, అమాయకంగా! ఈ సంగతి తెలిసి ఎలాభరించగలదు? “రవణా” అని ఒక్క కేకవేసి డాక్టరుకోసం పరుగెత్తాడు. తిరిగివచ్చేసరికి రవణకి తెలివిలేదు. పిల్లవాడు చనిపోయి చాలాసేపైందని చెప్పి, మూర్ఛపోయిన తల్లిసంగతి చూడాలన్నాడు డాక్టరు— ఆ తర్వాత రవణ మూడురోజులు కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. అన్నం ముట్టలేదు. ఆమెకి మతి చలించిపోతుందేమో అని కూడా రాజు భయపడ్డాడు. కాని అతని అదృష్టవల అలాంటిదేమీ జరగలేదు. రవణతండ్రీ అక్కాబావావచ్చారు. వాళ్ళవూరు తీసికెడతామన్నారు. రవణ ఇష్టపడలేదు. కాని బలవంతంచేసి—స్థలంమారిస్తే దుఃఖం మరపుకి వస్తుందని తీసికెళ్ళారు.

నెలగడిచింది. రాజు ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు రాసేదికాదు రవణ. కాని హఠాత్తుగా ఒకనాడు ఇంటికివచ్చిన రవణని చూసి ఆశ్చర్యపోయాడురాజు. సరాసరి బాబీ మంచం దగ్గరకి వెళ్లి వలవలా

# కాళరాత్రి

వెళ్ళిపోతానూ! (అంతా నిర్ఘాంతపోతారు. రాజా మెల్లెక్కుతూ—) హత్య చేసినవాడెవడా అన్న విషయంలో అణుమాత్రం సందేహం వుండదుగాని - హంతకుడు పట్టుబడని హత్యాగాథ ఇదొక్కటే ధరణిలో! హాయిగా నిద్రపోయి మీరుకూడా మరిన్ని హత్యలు చేయండి కలల్లో!

[పడక గదిలోకి వెళ్లిపోతాడు. అంతా ఆశ్చర్య విభ్రాంతులై ఒకరి ముఖా లొకరు చూచుకుంటూంటారు.]

—: తెర :—

(ఇంకా వుంది.)

ఏడ్చింది. ఈమె రావడమూ ఒకందుకు మంచిదే అనుకున్నాడురాజు. లేకపోతే కొడుకుపోయిన ఈ దుఃఖంలో తర్వాత ప్రేమపాత్రుడైన తను దగ్గరలేకపోతే ఇంకా బాధగావుంటుంది. రెండునెలలు గడిచినా రమణ స్వస్థపడలేదు. ఆమె ఇక వెనకటి రమణకాదు. ఉత్సాహానందాలు వెల్లివిరిసే ఆమె వదనం సంతతశోకావృతమై ఉంటోంది. తత్ఫలితంగా లావణ్యం అంతా హరించి పోయింది—రాజు దిగులుచెంది ఖిన్నుడైపోయాడు.

ఆరునెలలు కడితే కాని రమణ దారిలో పడలేదు. మళ్ళీ ఉద్యోగానికి ప్రయత్నించడం మొదలుపెట్టింది—ప్రతిదానికీ అప్లై చేసేది. బొంబాయిలో ఎవరో స్నేహితురాలుంటే ఆమెచెప్పిన ఏవో కొన్నిటికి దరఖాస్తుచేసింది—రమణ ముభావంగా వుంటోవచ్చింది. రాజు దీన్నిగురించి అట్టే ఆలోచించలేదు. కాని అతను మాట్లాడ్డానికి ప్రయత్నిస్తేచాలు, ఆమె కళ్ళంటనీళ్లు పెట్టుకునేది. అతను కరిగిపోయి దగ్గరతీసేవాడు.

"సత్యవతి ఏమైందో రాజూ" అని ఒకనాడడిగింది. ఈ వింతప్రశ్నకి రాజు ఆశ్చర్యపడ్డాడు.

"ఎంత చాకిరీచేసింది! పాపం దాని చిబ్బులో నా బాబీకి టానిక్కుకూడా కొనుక్కున్నా" అంటో వలవలా ఏడ్చింది." నీకేం మతిపోయిందా" అని రాజుగద్దించాడు.

ఒకనాడు సత్యవతి దగ్గర్నుంచి రమణకి ఒక ఉత్తరం వచ్చింది.

"అక్కా;

మీరుచూపిన దయ నేనెన్నడూ మరవలేను. మీ సంగతులేమీ తెలియలేదు. నా బతుకిక్కడమాత్రం చాలా దుర్భరంగా వుంది. నా కిక్కడ ఏదో సుఖంగా వుంటుందనుకున్నారు మీరు, మీకు తెలియక. మా వాళ్ళు మొదట ఆయనమీద విడాకులకు దావా వేద్దామన్నారు. నేను నా ప్రాణం పోయినా ఒప్పుకోనన్నాను. కాని భార్య ఉండగా మళ్ళీపెళ్లి చేసుకుంటే, నేరంటగదూ అందుకు కేసు మీ యిద్దరి మీదా పెడతారట—దీన్ని నేను ప్రతిఘటిస్తున్నాను. కాని భర్త ఆదరంలేని ఆడదానిమాట వింటెల్లుతుంది? చెల్లదని తోస్తుంది. ఈ గొడవలేమిటో నాకేం తెలియడం లేదు. నాకేమో భయంగావుంది. ఎందుకేనా మంచిదని మీకు రాస్తున్నాను.

మీ

సత్యవతి.

రాజుకి ఈ ఉత్తరంచూపి 'ఏమంటారు' అంది.

"ఏడిశారు." అన్నాడు రాజు. రమణ మాట్లాడలేదు. కాని ఆమె దాన్నిగురించి ఆలోచించడంమానిం దనడానికి ఆధారాలు లేవు. ఈ ఉత్తరాన్నే ఆమె ఒకనాడు నారాయణకికూడా చూపి 'ఏమిటి మీ అభిప్రాయం' అంది. అతను ఏడిశారని కూడా అనలేదు.

'అంటే నన్నెదో మోసం చేశారనడం కాదు సుమండీ ఇది. ఇందులో ఎవరు చేసిందీ ఏంలేదు. నేనే ఆత్మవంచన చేసుకున్నానని నా అభిప్రాయం. అవునా కాదా చెప్పండి?' అని సాభిప్రాయంగా చూసింది.

బాబీ పోయాక మళ్ళీ రమణలో ఈ 'స్పిరిట్' ఇంతవరకూ చూళ్లేదు. రమణ మళ్లీ పూర్వపు రమణ అయింది—తెలుస్తోనే వుంది. ఆమెలో నైరాశ్యం ఏమూలా లేదు. ఏదో కర్తవ్యనిశ్చయం చేసుకున్నదానిలా వుంది.

'మీ రివేవీ లెక్కచెయ్యకండి' అన్నాడు నారాయణ, ఏదో చెప్పాలి కనక.

వారం గడిచాక 'నే నొకసారి మా నాన్నదగ్గరికి పోయివస్తా' నంది రమణ. రాజు సరే అన్నాడు—కాని వెళ్లి వారం గడచినా రమణ ఉత్తరం రాయలేదు. రాజు నిష్ఠూరంగా రాసినమీదట రమణదగ్గర్నుంచి ఒక పెద్ద ఉత్తరం వచ్చింది.

'రాజూ,

నేనెంత భరించలేని మనోవ్యథతో ఈ ఉత్తరం రాస్తున్నానో నువ్వు గ్రహించలేవు రాజూ. బాబీ చావు నా గుండెను కలచివేసింది. బిడ్డల మరణానికి అందరూ విచారిస్తారు. కాని నా సంగతి వేరు. నా ఆశలన్నీ వాడిమీదే పెట్టుకున్నాను. కడుపున పడగానే వాడెంతగా వద్దనుకున్నానో భూమ్మీద పడ్డాక అంతగా వాడిమీద ఆధారపడి బతికాను. కాని నన్నే మోసం చేసిపోయాడు: మన పెళ్ళినిగురించీ, ఈ వ్యవస్థలో నాస్థానంగురించీ, నా ఆవేదనలు మొదటినుంచీ నాకుండనే ఉన్నాయి. ఇన్నాళ్లు బాబీని చూసి అవి కొంత మరవ కలిగాను. సత్యవతి ఉత్తరం—నా స్థానం ఏదో విడమర్చి చెప్పింది—ఆమె హృదయ విదారకస్థితి చూశాక, విన్నాక—నాలో రేగిన అశాంతి అణచుకోలేను. నేనూ నువ్వూ ఇక కలుసుకోం. నాకు బొంబాయిలో ఉద్యోగం దొరికింది. నన్ను మరచిపో. నా మనసు మారిపోయింది. అనుభవాలు నన్ను మార్చేశాయి. నన్ను ఏమన్నా అనుకో నువ్వు. నేను స్వార్థపరురాలనైపోయాను. జీవితం అనేది జీవించడానికి కాని నావలె ఏడుస్తూకూచోడానికి కాదని నాకు తెలిసింది. ఇక ఏడుస్తూ కూచోదల్చలేదు.

"ఏయ్ ప్యూన్! బయట ఎవరూ తలుపుతట్టుతున్నారు. నే నింట్లోలేనని వెళ్లి చెప్పరాదూ?"

"చెప్పానండీ. వినిపించుకోటంలేదు"

"మర్యాదగా విని పోతాడా? లేక నేనే వచ్చి చెప్పాలా! అడిగి కనుక్కో:"

—గోపిశ్రీ

ఈ జీవితం ఒక ప్రవాహంలాంటిది. అలాగే మనం కూడా ఆశాభావంతో సాగిపోవల్సిందే. ఈ నా ప్రయత్నంలో నీకు దూరం అయిపోవాలి. కాని బాబీ చావుని భరించ కలిగిన ఈ కఠిన హృదయానికి—ఇదేమంత కష్టంకాదు.

కాని నన్నెంత ప్రేమించావు రాజూ! ఈ ఆలోచనే నన్ను వెనక్కి లాగేది ఇన్నాళ్ళూ! కాని ఈ హృదయశల్యంతో జీవితకాలం అంతా బాధపడలేను. నువ్వూ నేనూ ఒకటయ్యామన్నదీ, నాకొక అండ దొరికిందనడం—ఒక అభాస మాత్రమే. నాలో అశాంతికి కారణం ఈ సంవత్సరం అంతా వెతికాను. సంఘం నిజమైన ప్రేమికుల్ని ఇలాగే బాధిస్తుంది అని సులభంగా వివరించుకో చూశాను—కాని బైటి ప్రపంచంలో లేదు ఆ కారణం. సత్యవతి దుర్భర జీవితానికి ఇంత నిష్కళంక ప్రేమ కారణమైతే—ఇది ధర్మమేనా అని తోచక పోలేదు.

ఈ అశాంత పరిస్థితులలో నేనొక బానిసననే భావం కల్గింది. మళ్ళీ ఒకసారి మానసికంగా స్వతంత్రననే భావంకోసం తపించాను. అది ఈవిధంగాతప్ప సాధ్యంకాదు. నా రెండేళ్ల వ్యథకి కారణం ఇలా ఊహించాను, అది పొరపాటు కూడా కాదు.

ఈ మనఃపీడనకి కారణం ఉంటే అది ఒకటే. అది నేను చేసుకున్నదే. పెళ్లి కాకుండానే గర్భవతిని కావడం. ప్రేమికుల భాషలో 'పెళ్లి' దానికో 'లైసెన్సు' లేదని తెలుసు. అయినా ఈ తొందరపాటే నా హృదయశల్యం: అది మొదలు పరంపరగా మనం ఒకవిధంగా జీవించవల్సి వచ్చింది. ఒక్కొక్కసారి అనుకుంటాను. సత్యవతి ఉందని తెలిశాక; [illegible] ఏదో పరిష్కరించి మరో మనం కలిస్తే ఎంత

##  రాగముక్త 

మాత్రం లేదని! కాని అప్పుడామె ఒక సమస్యగానే తోచలేదు.

ఏమయినా మనం—ఏదో కారణంవల్ల—మళ్ళీ బయలుదేరిన చోటనే వున్నాం. చేతులు దులుపుకుని మళ్ళీ నేను రెక్కలు వచ్చిన పక్షిలా ఫీల్ అవుతున్నాను. నా జీవితం నువ్వనుకున్నంత నిష్కళంకం కాదు రాజా. నారాయణకి అంతా తెలుసు. నేను నీతో అబద్ధం ఆడేను. నేను వెంకటేశ్వర్లుని ప్రేమించాను ఒకప్పుడు—కాని ప్రస్తుతం నేనీ నిర్ణయానికి వచ్చినది పశ్చాత్తాపంకొద్దీ కాదు, సత్యవతికోసమూ కాదు. నిజానికి వాళ్ళనిగురించి ఆలోచనలే లేవు. ఇదంతా నా స్వార్థంకోసం. ఇప్పుడు నిన్నుగురించికూడా నేను ఆలోచించటంలేదు. నా హృదయదౌర్బల్యం నశించి; మళ్ళీ నా భవిష్యత్తుకి అధికారిణిని నేనే అయ్యాననే సంతోషంలో నాకు మిగతా దేం కన్పించడంలేదు. ఇలా మనం విడిపోవడం మనిద్దరికీ మంచిది. 'జీన్ క్రిస్టాఫ్' నవలంటే నీకిష్టం అనేవాడివి. దానితోనే నా జీవితం మేళవించుకున్నాను. జీవితం ఒక ప్రవాహంవంటిది. నడవగలిగినంత దూరం దాని ఒడ్డున నడవడమే మన పని. ఇందు నిరాశకి తావులేదు. నన్ను క్షమించిపో రాజా.

రమణ.'

రాజు ఉత్తరం చదువుకుని ఏడ్చాడు. నారాయణకి కూడా చూపి కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు—'తన వాగ్దానాలన్నీ మరిచిపోయింది' అనలేదు అతను.

'తన పాతజీవితం, చెప్తే నా ప్రేమ నశిస్తుందనుకుంది కాబోలు. రెండేళ్ళు కాపురం చేశాము. జీవితమంటే ఆమాత్రం తెల్సుకోలేకపోయింది' అన్నాడు. నారాయణ మాట్లాడలేదు. 'నారాయణా నువ్వు అదృష్టవంతుడివోయ్. చక్కగా పెద్దవాళ్లు కట్టిన పిల్లని చేసుకున్నావు. కాని మాలాంటి జీవితా లుండవద్దూ మరి.' అన్నాడు రాజు.

ఇదే మాట వెనక రమణ ప్రేమని గురించి బాధపడే వెంకటేశ్వర్లూ అన్నాడు నారాయణతో.

కాని నారాయణ కివేళ తెల్సు, వెంకటేశ్వర్లూ అందరికంటె సుఖంగా వున్నాడని. రమణ కూడా ఇకముందు సుఖంగా వుంటుంది. ఇద్దర్ని ప్రేమించినా జీవితసాగరంలో ఆమెకి అమృతభాండం దక్కలేదని విచారించ పనిలేదు. ఆమెలో కలిగిన ఆశావాదమే ఆమెకు సకలసౌఖ్యాలూ సమకూర్చగలదు. కాని రాజు మాటే ఇప్పుడప్పుడే చెప్పలేదు. ★

##  పబ్లిసిటీ 

(21-వ పేజీ తరువాయి)

'ఛాన్సు' కొంపుందిలే రోజులు కలిసి రావాలన్నాడు. ఆ తర్వాత యిద్దరం వేరే వేరే పనులమీద ఎవరిదారిన వారు వెళ్ళి పోయాం.

ఆ తర్వాత ఆయిదారు రోజులకు కాబోలు నాకు టైఫాయిడ్ వచ్చింది. ఇరవైమూడు లంఖణాలు చేయించింది. రామారావు పనితొందరవల్ల కాబోలు రాలేదు. నాజ్వరం సంగతి తెలిస్తే వచ్చేవాడేగానీ, అతణ్ని గాబరా పెట్టడం యిష్టంలేక తెలియనివ్వలేదు. ఒకనాడు డాక్టర్ యిక రేపటినుండి ఆఫీస్‌కి వెళ్లొచ్చన్నాడు.

ఆ సాయంత్రం రామారావు యింటికి వెళ్దామని బయలుదేరాను. అప్పటివరకు ప్రచండంగా ప్రకాశించిన సూర్యుడూ పడమట దిగజారిపోతున్నాడు. తల దించుకొని పోతున్న నేను ఒక్కసారి తలెత్తాను.

ఎదుట రామారావు కనపడ్డాడు. ఈసారి మోటార్ సైకిల్ మీద కాదు, నడిచి వస్తున్నాడు. అతని ముఖం దీనంగా కనపడుతోంది. ఇద్దరం ఆగాం. కారణం అడక్కుండా వుండలేకపోయాను.

'ఏం! అలా వున్నావ్'

'ఈ వేళటినుండి మన ఉద్యోగం నాస్తి' అన్నాడు బాధగా.

'ఏంచేత! ఈమధ్యనేగా ప్రమోషన్ వచ్చిందన్నావ్. అప్పుడే ఎలా తీసేశారు?'

'ఆ 'మోహన్ సోప్స్' వాళ్లున్నారు కదూ?'

'అవును'

'వాళ్లు బిజిలీఫోటో టెస్టిమోనియల్‌తో కి బుష్‌కోటు బట్ట తయారుచేయించారు. అంచేత వాళ్ళసబ్బువాడుక ఎక్కువయింది. మా కంపెనీ పడుకొంది. నా ఉద్యోగం ఊడింది."

"మరి మీరుకూడ బిజిలీఫోటో, టెస్టిమోనియల్ తో నేకదూ, బట్ట తయారు చేయిస్తా ఆ బట్ట సేలవకమేంటి?" అన్నాను విషయం అర్థంకాక.

"నేను బుష్‌కోట్ తొడుక్కున్న బిజిలీ ఫోటో కదూ పుచ్చుకున్నాను?"

"అవును"

"ఆ మోహన్ సోప్స్, పబ్లిసిటీ ఆఫీసరు ఆవిడగారికి మరో అయిదొందలు హెచ్చు చేసి బుష్‌కోటూ తొడుక్కోకుండా మరేబట్టా కట్టుకోకుండా వున్న ఫోటో పుచ్చుకున్నాడు."

నేను షాక్ అయి "నిజంగానా?" అని కేక వేశాను.

"ముమ్మాటికి నిజం" అన్నాడు.

అప్పటి కర్థమయింది నాకు, పబ్లిసిటీలో వుండే ఘోరమైన నగ్న సత్యం. ★

రైలులో ఒకరు: (ముష్టివానితో) ఏయ్, రైలు వెళ్ళుతూన్నప్పుడు పాడుతున్నావ్, ఆగినప్పుడు మానేస్తున్నావేం?

ముష్టివాడు:- ఆగినప్పుడు పాడితే అపస్వరాలు వస్తాయండి.

శ్రీపాద సుబ్రహ్మణ్యం—వాల్తేరు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.



కాశీ హిందూ విశ్వవిద్యాలయం ఫార్మసీ డిపార్ట్‌మెంట్
ఫొటో : శ్రీ హెచ్. యస్. వేదాంతం.



గ్రంధాలయ భవనం
ఫొటో: శ్రీ హెచ్. యస్. వేదాంతం

Regd. No. M. 4479

Andhra Patrika Illustrated Weekly.